


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్‌ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికి
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—విశ్వతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్



# నెల నెలా మీ యింట
# నిండు వెన్నెల పంట

నెలకోసారి వినీలాకాశంలో
విరబూసె పున్నమి చంద్రుడు
కెరటాల రేకలు విప్పుకుని
వెలుగుజిగల మెలి ముసుగు కప్పుకుని
తరంగ మృదంగ ధ్వనులలో
యెగసిపడే యెదతో కదలి కలిపి
మాసం మాసం మనోవికాసం గుబాళించే
విశిష్ట మాస పత్రిక విజేత

ఆలోచనల కనులతో యెదురుచూస్తున్న
చూసే విజ్ఞులైన పాఠకులు
జీవన సాగర యానంలో
పాఠకుల మధుర నేస్తం విజేత
కథా సాహిత్యానికి కలికి తురాయి
తెలుగు పత్రికా రంగంలో మరో మైలురాయి,
ప్రతి నెలా మీ యింట పండువెన్నెలలు కురిసే
అక్షరాల జాబిల్లి విజేత

## ప్రజాభిప్రాయ వేదిక ప్రజాతంత్ర వారపత్రిక
## అందిస్తున్న మరో కానుక విజేత విశిష్ట మాసపత్రిక

1/8 డెమీ :
200 పేజీలు :




వెల :
3 రూపాయిలు

నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్-500 001

'విజేత' ప్రారంభ సంచిక ఉచితంగా కావాలా? వివరాలకు "ప్రజాతంత్ర" చూడండి!



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం : 28–10–'77
పింగళనామ సం. ఆశ్వీయుజ బ. విదియ

సంపుటము 71 సంచిక 6

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20–80
విడిప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003

## విషయానుక్రమణిక

విజయదశమి కానుక!

కృష్ణ సమర్పించు



శ్రీ పద్మావతీ పిక్చర్స్

# మనుషులు చేసిన దొంగలు

ఈస్ట్మన్ కలర్

నిర్మాత
యు. సూర్యనారాయణబాబు

దర్శకత్వం
ఎం. మల్లికార్జునరావు

శ్రీ సత్యా ఫిలింస్
రిలీజ్

SOUJANYA










# మన లో మాట

పాఠకులకి రచయితలకి ప్రకటనకర్తలకు ఏజెంటులకు అందరికి మా దసరా శుభాకాంక్షలు ...

ఈ సంచికలో 'శాంతితీరం' పూర్తి అవుతూ వుండగానే మరో కొత్త సీరియల్ 'జీవన పోరాటంలో ఆశల ఆరాటం' ప్రారంభించాము... రచయిత శ్రీ పి. వి. ఆర్. శివ కుమార్ 'శమంత – హేమంత' సీరియల్ రచన ద్వారా పాఠకులకి సుపరిచితులే... 'కస్తూరి' అన్న గొలుసు కథ వ్రాసిన నలుగురు రచయితలలో శివకుమార్‌గారు కూడా ఒకరు.

సినిమా శీర్షికలో యీ మధ్య ఎక్కువ వార్తలు, బొమ్మలు, విశేషాలు యిస్తూ వుండటం పాఠకులు గమనించే వుంటారు.

* * *

రచయితలు చాలా మంది మా అభ్యర్థన మన్నించి నిబంధనలు పాటించి – హామీ పత్రం జత చేసి తమ కథలు పంపుతున్నారు ... యిందుకు సంతోషం కాని యింకా కొందరు– మాకు పరిశీలనకి పంపిన రచనలు మా నిర్ణయం తెలియకుండానే యితర పత్రికలకుపంపటం అవి ఆమోదింపబడ్డాయి అంటూ మేము మా ఆమోదం తెలియజేశాక మాకు తెలియజేయడం– చేస్తూనే వున్నారు... ఈ సందర్భంలో చిన్న విన్నపం– మీరు నిరీక్షించలేకపోతే- వేరే పత్రికకు ఆ రచనను పంపుతూ కనీసం– ఆ విషయం మాకు వెంటనే వ్రాయండి... ఫలానా రచనను మేము మరో పత్రికకు పంపుతున్నాము అని !

సాధారణంగా మానిర్ణయం మీకు తెలియడానికి కనీసం 6 వారాలు అన్నామేగాని యిది గడువుకి ''గరిష్ఠ పరిమితి'' కాదని చెప్పనక్కర లేదనుకుంటాము.

# దుర్గమ్మ వారికి ఎన్ని చేతులుండాలి ?

దుర్గకి ఎన్ని చేతులు ఉండాలి ? దసరా సందర్భంలో పత్రికలకి బొమ్మలు వస్తే వాటిని ఎన్నుకునే వారికి కొందరికి ఈ సందేహం లేక ప్రశ్న ఎదురవుతుంది! దీనిని పోగొట్టగలిగిన వారు పండితులే – అయితే, వారిని ఎప్పుడు అడిగితే అప్పుడు సమాధానం ఏమి స్తుందని ఈ విలేఖరి స్వయంగా కొన్ని పుస్తకాలు తిరగేశాడు. హడావుడిగా సేకరించిన వివరాలు కొన్ని :

* పశ్చిమ బెంగాల్‌లోని దినాజ్‌పూర్‌లో ఒక శిల్పం దొరికింది. ఇది మహిషాసుర మర్దని శిల్పం. దానికి 18 బాహువులు ఉన్నాయి అదే శిల్పంలో చిన్న బొమ్మలు వేరే చెక్కి ఉన్నాయి. వాటిలో 16 చేతుల అమ్మవారు కనిపిస్తుంది.

* ఒక బీహారు శిల్పంలో 4 చేతుల బొమ్మ ఉంది.

* పశ్చిమ చాళుక్యుల ఐహోలులో 8 బాహువుల దుర్గ బొమ్మని చూడవచ్చు.

* ఒక ఎల్లోరాలోని శిల్పంలో 8 చేతులు కనిపిస్తాయి.

* గుప్తుల కాలపు ఉత్తర ప్రదేశ్ శిల్పం అమ్మవారికి 2 చేతులు ఉన్నట్లు చూపిస్తుంది.

* మధ్యప్రదేశ్‌లోని ఉదయగిరి బొమ్మలో 12 చేతులు ఉన్నాయి

* చండీ మహాత్మ్యంలో 'దశభుజా'అని అన్నట్లు తెలుస్తోంది. బెంగాల్‌లో 10 చేతుల అమ్మవారి విగ్రహాలనే ఎక్కువ చేసుకుని పూజ చేస్తారుట ...

[ ఒ. వి. ]



# జనతా-కాంగ్రెసుపార్టీల ఆయుధ పూజ

శ్రీమతి గాంధికి గుజరాత్‌నుంచి తిరిగి వచ్చాకా— ఢిల్లీ రైలు స్టేషన్‌లో జనాలను తప్పించుకొని కారు ఎక్కడానికి 35 నిముషాలు పట్టింది — సి. ఆర్. పి, స్పెషల్ పోలీసు, భద్రతాదళాలు కూడా ఎంతో శ్రమపడ్డాయి. ఇందిరా వ్యతిరేక ప్రదర్శకులు అక్కడ ఒక్కరైనా లేరు— రుక్సానా సుల్తానా, ఆర్. కె. ధవన్, ధీరేంద్ర బ్రహ్మచారి గ్యాంగు మాత్రం ఆమెను తిరిగి అంటిపెట్టుకునే వుంటున్నారు.

## తాజా 'కాలమ్'

అడావుడిగానైనా— మొత్తంమీద హైకోర్టుకి వెళ్ళింది ప్రభుత్వం "ఇందిరమ్మమీద!"— హైకోర్టు న్యాయమూర్తి 'నోటీస్' అనటంతో — కోర్టులో ఇందిరమ్మమీద ప్రభుత్వం పెట్టిన అభియోగాలు రెండూ కూడా కేసుగా నమోదైనాయన్న మాట! అంచేత మనమేకాదు ఆరోగ్యమంత్రి రాజ్‌నారాయణ్‌గారు కూడా యింక ఆ రెండు అభియోగాలమీద ఇందిరమ్మ 'గిల్టీ' లేక 'నాన్ గిల్టీ' అన్న విషయం పబ్లిక్‌గా చర్చించరాదు కదా! అయితే చౌధురి చరణ్‌సింగుగారు ఇందిరమ్మమీదికి ధ్వజం ఎత్తిన తీరు విషయంలో దేశంలోని ఎన్నో పత్రికల వేళాకోళానికి గురి ఐంది. రేడియో, సమాచార్ సంస్థలు అన్నా—చాలా మంది పత్రికలవాళ్ళు హోంమంత్రిగారన్న "హైడ్రామా" జరిగింది అని ఒప్పుకున్నారుగాని అందులో ప్రధానపాత్ర మాజీ ప్రధానమంత్రిదేనని అంగీకరించారు కాని — దానికి "డైరక్టరు" మాత్రం చౌధురి చరణ్‌సింగ్‌గారేనని అనుకోవాలి!

దీనివల్ల మాజీ ప్రధాని ఇందిరమ్మ మళ్ళీ ప్రధానమ్మ అయిపోడానికి! అవకాశాలు యేమీ రాలేదుగాని— "తీన్ తేరా"గా వున్న ఆవిడగారి కాంగ్రెసు పార్టీ మాత్రం 'గబగబా' ఐకమత్యానికీ, అమ్మగారి నాయకత్వానికి చాలా ప్రాముఖ్యత వున్నదని గుర్తించింది!

మాజీ ప్రధానమంత్రి 3 వ తేదీ రాత్రంతా లాకప్‌లో గడిపి 4 వ ఉదయం కోర్టులో 2 గంటలు నిలబడి "టియర్ గ్యాస్"కి కూడా కన్నీరు కార్చకుండా — బేషరతుగా విడుదలై యింటికి పోయి అర్థాంతరంగా 4 గంటల స్వల్పవ్యవధిలో 4 మీటింగులలో మాట్లాడి విమానం ఎక్కి మొరార్జీ భాయిదేశాయిగారి గుజరాత్ పోయి రాష్ట్రంలోని జనాన్ని "ఉత్తేజపరచడం" ఇదంతా కూడా 'మళ్ళీ అరెస్టు' అయ్యేలోగా 'నేను జనాన్ని తగినంతగా కూడగట్టుకోవాలి" అన్న ఆదుర్దాతో చేసిందని కొందరి వూహ.

కాంగ్రెసు నాయకులు అమ్మగార్ని తిరిగి కాంగ్రెసు అధ్యక్షురాలివి కావాలన్నారు కాని ఆమె సూరత్‌లో అక్టోబర్ 6 న "నేను ప్రధానమంత్రినీగాను – కాంగ్రెసు ప్రెసిడెంట్‌నీగాను-చాలాకాలం ఆ పదవులు మోశాను" అన్నది !

"ఐతే మీ "ఎత్తు" ఏమిటి ? అని ఒక విలేఖరి అడిగాడు "నేనేం చదరంగం

(54 వ పేజీ చూడండి)




జాబిల్లి తన వెన్నెల కిరణాల సోయగాలను అవని మీద కురిపిస్తోంది. ఆ సోయగాలకు ఆ మేడమీద ఉన్న పందిరిమంచానికి చుట్టూ అందంగా,ఆకర్షణీయంగా నేర్పుగా, ఓర్పుతో అల్లిన మల్లెలమాలలు పులకితమై తమ అసాధారణ సువాసనలను గుబాళించుచున్నాయి. ఆ గుబాళింపులకు మరొకరైతే పులకించి పరవశమై, రానున్న సుందర క్షణాలకు మధురానుభూతి నొందుతారు. ఆ పులకింతలుగాని,మధురానుభూతులుగాని, పరవశాలుగాని మోహన్‌కు కలగటంలేదు తన ఆలోచన అంతా రాగిణి గురించే పేదరికపు ఉక్కు పిడికిలిలో అదమాయించబడి,తనకై తానుగా కోరితే, తన అభ్యంతరాన్ని ఏ కోశానా చూపకుండా చప్పున ఒప్పుకుంది. తనకేం తెలుసు, ఇక్కడ ఆస్తి, ఐశ్వర్యాలను మాత్రమే అనుభవించగలదని. తన వృత్తి వ్యాపారాలలో ప్రయాణించే మనిషి. అటువంటపుడు తనలో ఏ లోటున్నా, ఆ పధి మంది వ్యాపారుల మధ్య తనకు చిన్నతనం, అవహేళన కలుగుతాయి. వాటి బారినుండి తప్పించుకోడానికి రాగిణికి, కాకపోతే ఏ రాధకో, ఏ లక్ష్మికో తను అన్యాయం చేయక తప్పదు. ప్రతీ స్త్రీ ఏది కావాలనుకుంటుందో, ఏ అనుభూతి, ఆనందంకోసం పరితపిస్తుందో అవే తనకు కరువైనాయి అనుకుంటే ఆ స్త్రీ ఎంత మనోవేదనకు గురి అవుతుందో తనకు తెలుసు. ఎందుకంటె తనుకూడా వాటిని పొందడానికిగాని, అందించడానికిగాని చాలా దూరంగాఉన్నాడు.

రాగిణి భూమి పరిధిసంతా అవగాహన చేసుకోలేకపోయినా, తన పరిధిలో సమస్యలను, సంఘర్షణలను అర్థం చేసుకోగల వివేకి అని మోహనుకు తెలుసు. తనను తప్పకుండా అర్థం చేసుకుంటుంది. తనను ధన్యుణ్ణి చేస్తుంది.

ఈ ఆలోచనల పరంపరల మధ్య ఆడవాళ్ల పకపకలు విన్పించాయి. తను అటువైపు చూసేసరికి వాళ్ళంతా నిశ్శబ్దంగా ఉండిపోయారు! రాగిణిని మెట్ల ద్వారం దగ్గర వదలి, అడుగుల చప్పుడు కాకుండా ఎంతో నమ్రతతో మెట్లుదిగి వెళ్ళిపోయారు. ఆ భయభక్తులు అన్నీ తనకు గౌరవం ఈయాలనే. ఈనాడు తనకింత గౌరవం ఇచ్చేవాళ్లే, రేపు తన నిజస్వరూపం బయటపడితే ఈ గౌరవం తనకు లభిస్తుందా? అదంతా నా రాగిణి చేతుల్లోనే ఉంది. వెంటనే రాగిణి జ్ఞాపకం వచ్చింది.

నెమ్మదిగా లేచి రాగిణిదగ్గరకునడిచాడు. నిండు యవ్వనాన్ని తనలో పుంజుకొని ఏమీ ఎరుగని బేలలా తల వంచుకొని, అమరావతి శిల్పంలా అగుపిస్తుంది. నెత్తి మీద గుబురుగా అల్లిన ఎన్నోరకాల పుష్పగుచ్ఛాలు, జడ పొడవునా పూలు అల్లి, నల్లని త్రాచు పాముకు కెంపులు బిగించినట్లుంది. మెరిసే పట్టుచీర కాంతులు ముఖంమీద ప్రతిబింబించాయో అన్నట్లు, ఆ మోము కళకళలాడుతుంది. మోహన్ ఆమెను సమీపిస్తుంటే ఆమె గుండెలు అదురుతున్నాయి నవనాడులూ ఆమె శరీరాన్ని కంపింపజేస్తున్నాయి. మోహన్ ఆమె భుజాన్ని ఒకచేతో పట్టుకొనీ రెండవచేతో చుబుకాన్ని పట్టుకొని లేపాడు. ఇద్దరి కళ్ళూ ఒక్కసారి కలిశాయి. ఆ వెంటనే రాగిణి రెప్పలు బరువుగా వాలాయి. ఆమెను మంచం వరకూ నడిపించుకొచ్చాడు. ఇంత నిర్మలంగా ఆనందంగా వున్న కళ్ళు, నిజం తెలిస్తే ఎంతగా వర్షిస్తాయో. తను చెప్పే భయంకర నిజాన్ని విని ఈమె సున్నితమైన మనస్సు

ఎంతగా బాధ పడుతుందో అనుకున్నాడు.

పాలగ్లాసు చేతి కందించింది రాగిణి. దాన్నందుకుని ఆమె వైపు చూడకుండా పాలన్నీ త్రాగేశాడు. వింతగా చూసింది రాగిణి. గ్లాసు నందుకొని అడుగున మిగిలిన పాలచుక్కలే త్రాగింది. మోహన్‌కు నవ్వు వచ్చింది అందులో ఏదో వెలితి

"రాగిణీ!" చనువుగా పిలిచాడు.

నెమ్మదిగా కనురెప్పల్ని ఎత్తి చూసింది. ఆ చూపులో ఏమిటన్న ప్రశ్న ఉంది.

"రాగిణీ! ప్రతి కన్నె తన తొలిరేయి గురించి ఎన్నో ఆశలు పెట్టుకుంటుంది. తనభర్త తనను ఎంతో అనురాగం,ఆప్యాయతలతో ముంచి వేయాలని, తన జీవితాన్ని ఓ బంగారు పంట చేయాలని, సంసారంలో పన్నీటి జల్లు చిలకరించాలని, ఎన్నెన్నో ఆశలను వడబోసుకుంటుంది. భర్త సరసన తను పూర్తి స్వాతంత్ర్యాన్ని, స్త్రీత్వం పొందాలని ఎన్నెన్నో కలలు కంటుంది అలాగే మగవాడు కూడా. తన భార్యను పూర్తిగా సంతోషపెట్టకలిగి, ఆమె అమృతపుజల్లు తనను పునీతం చేయాలని ప్రతీ పురుషుడు కోరుకుంటాడు..."

ఇవన్నీ ఎందుకు చెబుతున్నట్లో అర్థం గాక అదోలా చూస్తుంది రాగిణి

"ఇవన్నీ ఎందుకు చెబుతున్నానో అని అనుకుంటున్నావు కదూ! ఇదంతా ఊరికే చెప్పటంకాదు, అలాగని భార్య దగ్గర ఏం మాట్లాడాలో తెలియకాకాదు ఇప్పుడు నేను ఒక నిప్పులాంటి నిజాన్ని చెప్పబోతున్నాను. అది నీ హృదయాన్ని మండించే నిజం. ధైర్యంగా ఉంటావు కదూ!" గంభీరంగా అన్నాడు

రాగిణికి సన్నగా వణుకు పుట్టింది. గుండె దడ దడ మంటుంది ముఖమంతా చిరు చెమటలు పట్టాయి. కళ్లు వర్షించ బోయే మేఘాల్లా ఉన్నాయి.

మోహన్ మొదలు పెట్టాడు. "ఒకసారి నాతోటి వ్యాపారస్థుడు ఒకతను పార్టీకి పిలిస్తే వెళ్లాను అక్కడ వాళ్లతోపాటు హాట్ డ్రింక్స్ త్రాగాను. సహజంగా ఇలాంటి సమయాల్లో త్రాగుతుంటాను. కాని ఆ రోజు పెగ్ ఎక్కువైంది. ఫర్వాలేదనుకొని బయలుదేరాను. కాని నా సర్వాంగాలు స్వాధీనం తప్పాయి. దాంతో స్టీరింగ్ కంట్రోలు తప్పి నా కారు ఒక పెద్ద చెట్టును గుద్దేసింది. నన్ను హాస్పిటల్‌లో ఎవరో ఎడ్ మిట్ చేసారు. నాకు ఎటువంటి వికలాంగత కలుగలేదు, కాని... కాని... రాగిణీ! మా వంశం ఇక్కడితో ఆగిపోయే ప్రమాదం వచ్చింది. నేను నా పురుషత్వాన్ని కోల్పోయాను." అంటూ గట్టిగా ఏడవసాగాడు.

'రాగిణికి అధః పాతాళానికి త్రోసి వేయబడినట్లు అయ్యింది. నోట మాట పెగల్లేదు అలాగే నిర్ఘాంతపోయి ఉండి పోయింది.

కొంతసేపు పోయాక—

"రాగిణీ! నా మీద నీ కెంతో కోపం వచ్చింది కదూ!"

"లేదండి. కోపం ఎందుకు?" మౌనంగా జవాబిచ్చింది.

"అలా అని నన్ను చిత్రవధ చేయకు రాగిణీ! ప్రతిస్త్రీ మాతృత్వంలోని మాధుర్యం రుచి చూడాలని, తన పిల్లల్ని తన చేతుల మీదుగా పెద్ద చేయాలని ఎన్నో ఊహలు అల్లుకుంటుంది ఆ ఊహలను నేను చెదరగొట్టాను. నన్నేం చేయమంటావు. పదిమందిలో అవహేళన పాలు కాకుండా నా గౌరవాన్ని శాశ్వతంగా నిలుపుకోవాలని నిన్ను బలిచేసాను. సిరి లేని బాధ కంటె మగసిరిలేని బాధే పురుషుడికి అవమానకరం. ఆ అవమాన అగ్నికూపం నుండి నుండి నేను తప్పుకొని నిన్ను దానిలోకి త్రోసేసాను. నన్ను క్షమించగలవా రాగిణీ!"

"బాధ పడకండి" అని నిర్లిప్తంగా నవ్వగలిగింది తప్ప రాగిణి ఏం మాట్లాడలేక పోయింది.

* * *

కొన్ని రోజులు కాలగర్భంలో కరిగి పోయాయి.

ఆ రోజు సాయంత్ర సమయంలో, చల్లగా వీచే గాలిలో మౌనంగా డాబామీద కూర్చుంది రాగిణి దూరపు కొండలు మసకగా కన్పిస్తున్నాయి. చల్లగాలికి రాగిణి మేను పులకిస్తుంది. మోహన్ కారు వచ్చిన శబ్దం విన్పించి క్రిందకు చూసింది. మోహన్ కారుదిగాడు. వెనుక సీటులోంచి ఎవరో ఒకామె చంటిబిడ్డను ఎత్తుకొని దిగింది. రాగిణి మనస్సు ఒక్కక్షణం ఘలించింది. వాళ్ళిద్దరూ నేరుగా లోపలకు వచ్చారు. మోహన్ చంటిబిడ్డను ఎత్తుకొని రాగిణి దగ్గరకు వచ్చాడు. రాగిణి మౌనంగా చూసింది. మోహన్ వైపు.

"రాగిణీ! చూడు, బాబు. ఎంత బాగున్నాడో కదూ! మన బాబే, మనం పెంచుకుందామనే తెచ్చాను. బాగున్నాడా!" అంటూ కప్పివున్న తెల్లటి గుడ్డను తీసి చూపించాడు.

రాగిణి మౌనంగా చూసింది బాబువైపు.



అంతే! తన కాళ్ల క్రింద నున్న భూమి ఇంకా క్రిందికి దిగిపోయినట్లయింది. ప్రశాంతంగా నున్న కొలనులో రాయి విసిరినట్లు తన హృదయం అల్లకల్లోల మయ్యింది. దూరంగా నున్న కొండలు కరుకుగా కన్పించాయి. వీస్తున్నగాలి తన ఒంటి వేడిని చల్లార్చలేక పోయింది.

"రాగిణీ! మనకు ఎలాగూ సంతాన యోగ్యం లేదు. ఇంటిలో ఒక్కతివే ఉండి మనోవేదన అనుభవించకుండా బాబుతో ఆడుతూ, పాడుతూ సంతోషంగా ఉంటావని, మన వంశం ఇంతటితో ఆగిపోగూడదని తీసుకొచ్చాను. రాజారావ్ శరణాలయానికి పనుండి వెళ్తే అక్కడ చూసాను. నాకింక వదలబుద్ధికాలేదు నీ కిష్టం లేకపోతే చెప్పు తిరిగి ఇచ్చేద్దాం. వయస్సు ఆర్నెల్లట. ఎవరో గుమ్మందగ్గర వదల వెళ్ళిపోయారట. చెప్పు రాగిణీ! ఏం చేయమంటావ్?" తట్టాడు.

మళ్లా ఈ లోకంలోకి వచ్చింది.

"ఏ శరణాలయం?" అనుమానంగా అడిగింది.

"రాజారావ్ శరణాలయం" అమాయకంగా చెప్పాడు.

రాగిణి అనుమానం నిజ మయ్యింది. బాబు వంకే అదేపనిగా చూస్తూ నిల్చుంది.

"చెప్పు రాగిణీ! నీ కిష్టమేనా?"

"మీ ఇష్టమే, నా ఇష్టం" ముక్తసరిగా జవాబిచ్చింది.

మోహన్‌కు ఎపుడూ కలగని ఆనందం ఈ రోజు కలిగింది.

"థాంక్స్ రాగిణీ! ఈ బాబు మన బాబేనని లోకాన్ని నమ్మించేయొచ్చు. దా రాగిణీ! ఆయాను కూడా కుదుర్చుకొచ్చాను. క్రింద ఉంది." అంటూ రాగిణిని లాక్కెళ్ళాడు.

"ఆయా అక్కరలేదు. నేను చూసుకోగలను" అంది.

మోహన్ ఒప్పుకున్నాడు.

ఆ రోజు రాత్రి ఇద్దరూ బాబును వదల్లేదు.

రాత్రి పది దాటింది. బాబు రాగిణి, మోహన్‌లు మధ్య హాయిగా నిద్రపోతున్నాడు. మోహన్‌బాబు మీద చేయివేసి పడుకున్నాడు. అతని ముఖంలో ఎన్నడూలేని సంతోషం ఈరోజే చూసింది రాగిణి.

## జీవితమే మోసం

కాని రాగిణి మనసులో మాత్రం ఏదో మెదులుతూంది. బాబును మరొక్కసారి చూసింది. నిర్మలంగా పడుకున్నాడు. బాబు చెవి దగ్గరున్న చింతపిక్కంత పుట్టుమచ్చను ముద్దు పెట్టుకుంది. కాని తన మనస్సు గత జీవితాన్ని కుమ్మరి పురుగులా తొలుస్తుంది.

రాగిణి వాళ్లది మధ్యతరగతి కుటుంబం. తల్లి, తండ్రి, ఒక తమ్ముడు, ఒక అక్క, తను ఆ కుటుంబ సభ్యులు. అక్కకు పెళ్లి

## రేపటి....?

— డా॥ సి. నారాయణరెడ్డి

అబ్బ! ఏక్కడిదీ
నిశ్శబ్దం?
అగ్నిపర్వతాల
నిశ్వాసం.
అమ్మో! ఎక్కడిదీ
సంచలనం?
ప్రళయ జలధరాల
సంజ్వలనం.
ఉష్! ఏమిటా
అరుపులు?
ఆకలి కొరడాల
చరుపులు.
ఓహ్! ఏమిటీ
మూల్గులు?
రేపటి నెత్తుటి
వెల్గులు.

ఐపోయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాగిణికి మేనత్త కొడుకు రాజు అనే బావ ఉండేవాడు. చిన్నప్పటి నుండీ రాజుకు, రాగిణికి పెళ్లి చేద్దామనుకునేవారు. రాగిణి కాబోయే భర్తగా, చిన్ననాటి నుండీ కలసి ఉన్న స్నేహంలో చాలా చనువుగా ఉండేది, రాజుతో. కాని పరిస్థితి మరో విధంగా మారింది. దాని ఫలితంగా రాగిణి నెల తప్పింది. రాజు మిలటరీకి వెళ్ళిపోతున్నానని చెప్పి వెళ్లిపోయాడు. అక్కడి నుండి ఏ విషయం ఇంటికి తెలియపరచలేదు. రాగిణికి అనుమానం వచ్చింది. రాజు తనను మోసం చేసాడని కాని నిజాన్ని బయట పెట్టలేక పోయింది. కాని నిజం అగుతుందా? ఎదిగే పొట్ట, వచ్చే వాంతులు నిజాన్ని బయట పెట్టేశాయి. ఇంట్లో అందరూ గొల్లు మన్నారు. రాగిణి మేనత్తను కూడా అడిగారు రాజు గురించి. కాని ఆమెకు కూడా రాజు జాడ తెలియ లేదు. దాంతో అందరి గుండెల్లో రాయి పడింది.

డాక్టరు దగ్గరకు తీసుకెళ్లారు. అబార్షన్ చేసే సమయం దాటిపోయింది. కనడం తప్ప మరో దారి లేదన్నాడు. ఎలాగో గుట్టుచప్పుడు కాకుండా కార్యక్రమాన్ని పూర్తిచేసారు.

ఎంతో అందాన్ని పుణికి పుచ్చుకున్న బాబుని వదలలేకపోయింది, తల్లి రాగిణి.

"వదలకపోతే ఎత్తుకొని తిరుగుతావా మహాతల్లీ! చేసిన నిర్వాకం చాలుగాని" అంటూ సాధించారు పెద్దవాళ్ళు.

వాళ్ళ మాటలను లెక్కచేయకుండా ఒక పదిహేను రోజులు ప్రేమతో సాకింది బాబును. ఇంక పెద్దలు ఊరుకోలేదు. పనికట్టుకొని మరీ తల్లీబిడ్డను వేరుచేసి, బాబును అనాథ శరణాలయం దగ్గర వదిలేసారు.

మరో మూడ్నెల్లలో రాగిణి మోహన్‌కు సంబంధం నిశ్చయమైంది.

బాబు నిద్రలో దడుసుకున్నాడు కాబోలు ఒక్కసారిగా కెవ్వుమన్నాడు. రాగిణి ఆలోచనలు ఒక్కుదుకున పారిపోయాయి, బాబును తన ఒడిలో పెట్టుకొని పాలసీసా ఒకటి నోటి కందించింది.

మోహన్‌కూడా లేచాడు. తృప్తిగా బాబువైపు, రాగిణివైపు చూసాడు.

కొంతసేపటికి బాబు నిద్రపోయాడు.

"ఏవండీ!" సన్నగా పిలిచింది.

"జరిగిన విషయం మోహన్‌తో చెప్పేయాలి. ఈ నిప్పులాంటి నిజాన్ని తన గుండెల్లో దాచుకుంటే అది గుండెనే దహించుతుంది అదీకాక ఇది తరువాత ఇంకొక ప్రమాదానికి పరిణామం చెందవచ్చు" అనుకుంది.

"ఏవండీ!" నెమ్మదిగా తట్టి లేపింది.

బద్ధకంగా లేచాడు మోహన్.

"ఎందుకు రాగిణీ!" అని లేచి కూర్చున్నాడు.

"బాబు... బాబు..."

# మామూలు మనిషికి "ముందస్తు జామీను" దొరుకుతుందా?

తెలుగు వార్తాపత్రికలలోకూడా "యాంటిసిపేటరీ బెయిలు" అని యీ మధ్య తెగ రాస్తున్నారు... దీన్ని పెద్ద పెద్ద నాయకులు తీసుకుంటున్నారు... అంటే యేమిటి? అని ఎంతోమంది సామాన్య పాఠకులకి అనుమానం వస్తూంటుంది ... అంటే 'అరెస్టును' వూహించి (వాంఛించి కాదు) ముందుగానే కోర్టువారి దగ్గరికి పోయి అరెస్టయిన వెంటనే విడుదలకి జామీను తీసుకోడం అన్నమాట...అయితే యిది మామూలు మనుషులకి తీసుకోడం సాధ్యపడదు...



కిస్సాకుర్సీకా?

ఈ యేడాది జులై నెలలో జనతా గద్దెకెక్కిన తర్వాత ఎక్కడ చూసినా యీ "ముందస్తు జామీనుల" వార్తలే వెలువడ్డాయి... సంజయ్‌గాంధీ, బన్సీలాల్, నందిని శతపథి ప్రభృతులకి యీ "ముందస్తు జామీనుల" అవసరం వచ్చింది! జనతా, కాంగ్రెసు మాజీ నాయకులనందర్నీ వెంటాడటం మొదలెట్టింది.

1974 సంవత్సరానికి ముందు యీ 'ముందస్తు జామీను' అంటె యేమిటో హైకోర్టులకీ తెలియదు. కాని శ్రీ గజేంద్ర గాడ్కర్‌గారి నాయకత్వంలో యేర్పడ్డ 41 వ న్యాయ సంస్కరణల సంఘం యీ ముందస్తు జామీను సిఫార్సు చేసింది.

"రాజకీయాలలోను వ్యాపార రంగంలోను తమ ప్రత్యర్థులను అరెస్టుచేసి బద్‌నామ్ చేయాలన్న కోరిక కక్షదారులమధ్య వస్తే — అవతలివారు యిబ్బందులకి గురి అవుతారు. కనుక ముందుగా యిటువంటి బడా ఆసాములకి జామీను తీసుకునే హక్కు వుండాలి" అన్న అభిప్రాయాన్ని.

41 వ 'లా కమిషన్' చెప్పడంతో ఈ ముందస్తు జామీను చట్టబద్ధమైంది. యమర్జెన్సీ లేచిపోయాకా మాజీ మంత్రులకిది తాత్కాలిక రక్షణగా ఉపయోగపడు తున్నది...

కాని యిది తీసుకోవాలంటే చాలా 'స్టాటస్' ఎంతో 'డబ్బు' కావాలి. మామూలు కోర్టులలో యిది దొరకదు. హైకోర్టు లేదా సెషన్సు కోర్టు మాత్రమేయిది యివ్వాలి.

ఈ మాదిరి జామీనుకోరే వ్యక్తికి మంచి వ్యాపారం, హోదా, యిల్లు, ఆదాయంపన్ను చెల్లిస్తున్న రశీదులు; కనీసం వెయ్యిరూపాయిలకన్నా ఎక్కువ మొత్తంఒకకోర్టులో కట్టి జామీను యిచ్చే స్నేహితులు — యిలాంటి వెన్నో





యూత్‌కాంగ్రెస్ నిధులు

వుండాలి — పైగా కోర్టు ఖర్చులు కూడా మామూలు మనిషి అందుబాటులో ఎట్లాగా వుండవుకదా !

అంచేత మధ్యతరగతి మనిషికి — అతని పరువు ప్రతిష్ఠలు సమాజంలో నోట్ల రూపంలోగాక — కేవలం నోటి మాటల రూపంలో వుంటాయి కనుక యీ ముందస్తు జామీను పొందే అవకాశం వుండదు — అతన్ని మెడలు వొంచి పోలీసువాళ్లు లాకప్‌లో పారేస్తే దిక్కేమీ వుండదు.

— [పిరాజీ]

---

"ఏమిటలా గొణుగుతున్నావ్! చెప్పేదేదో చెప్పు రాగిణీ!"

"మరి... బాబు... నా బాబేనండి" ఒక్కసారిగా అనేసింది.

మోహన్ ఉలిక్కి పడలేదు. "ఇది మరీ బావుంది రాగిణీ! నీ బాబు ఎలా అవుతాడు? మన బాబు" అన్నాడు నవ్వుతూ ఏమీ ఎరగనట్లు.

"అది కాదండీ! బాబు నిజంగా నాకు పుట్టిన బాబే! నన్ను క్షమించరూ!" అంటూ ఒడిలో తలపెట్టుకొని ఏడ్వసాగింది.

గట్టిగా నవ్వాడు మోహన్.

రాగిణి ఆశ్చర్యంగా చూసింది ప్రశ్నార్థకంగా!

"అవును రాగిణీ! ఈ విషయం నాకు తెలుసు. మీ నాన్నగారే నిజాన్ని నాకు చెప్పారు."

"మా నాన్నా..." ఆశ్చర్యంగాఅడిగింది.

"అవును. ఈ విషయం నాకు చూచాయగా ఎవరో చెప్పకోవడం తెలిసింది. అది నిజమైతే ఎంతో బావుండునని ఎన్నో దేవుళ్లకు మొక్కుకున్నాను. మీ నాన్నగారిని ఈ విషయం నిజంగా చెప్పమన్నీ అందువలన ఏటువంటి నష్టం ఉండదనీ నిలదీసాను."

"నన్ను క్షమించండి, మిమ్మల్ని మోసం చేసినందుకు" అని అతని కాళ్లమీద పడింది రాగిణి.

"ఎందుకు? నేను మాత్రం మోసం చేయలేదా నిన్ను."

ఇద్దరూ ఒక్కసారిగా నవ్వుకున్నారు.

బాబుకూడా నవ్వుతున్నాడు నిద్రలో, దేవుణ్ని చూసి.

ఫాలా ఫ సె డైరీ




## నమ్మకం - నిజమ్!

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఖమ్మం జిల్లాలోని ఒక వూరిలో వర్షాలు పడక పోయేసరికి అమ్మవారిని కొలవడానికి గుడికి వెళ్ళితే గుడిలో అమ్మవారు లేదట. అవిగ్రహం ఆ వూరికి మైళ్ళ దూరంలో వున్న మరో వూరిలో పోయిందట. ఈ వూరి వారంతా దుర్గ పూజలు చేస్తూ, భజనలుచేస్తూ వెళ్ళి ఆ దుర్గాదేవి విగ్రహాన్ని తరలించుకు వచ్చి పునః ప్రతిష్ఠ చేసి సరికి వర్షం కుండపోతగా కురవ నారంభించిందట. దేవుడున్నాడా లేడా అంటే అది నమ్మే వారిని బట్టి వుంటుంది.

## విపరీతానికి దారితీసిన వినోదం

సేలంలోని ఓ బస్సు ట్రాన్సుపోర్టు యజమాని కూతురు 18 ఏళ్ళ సెల్వరసు అనే అమ్మాయి కాలేజీకి వచ్చేటప్పుడు, పోయేటప్పుడు సేలం మాజీ మున్సిపల్ ఛైర్మన్ కొడుకు 18 ఏళ్ళ అశోక్‌కుమార్ ఏడిపిస్తూ తన స్నేహితులతో వినోదిస్తుండేవాడట. ఓపిక పట్టినన్నాళ్ళు పట్టి ఇహ కుదరక ఆమె ఈ విషయాన్ని తన అన్న గారితో చెప్తే అతను అశోక్కుమార్ తండ్రితో ఈ విషయం చెప్పి హెచ్చరించాడట. దాంతో ఆ కుర్రాడు ఇంకా రెచ్చిపోయి, మర్నాడు స్నేహితులతో నడి బజార్లో ఆమెను మరింత అసభ్యంగా మాట్లాడి, హేళన చేశాడట. అనుకో కుండా అక్కడికి వచ్చిన ఆమె అన్నగారికి, అతనికి తత్సంబంధంగా పోట్లాటలు అయి, అది కొట్లాటగా మారిందట. ఈ సంఘటనలో అశోక్కుమార్ స్నేహితుడు కుప్పన్ కత్తితో సెల్వరసును, ఆమె కారు డ్రయివరును, బాలన్ అనే ఒకతన్ని పొడిచి చంపేశాడట. ఈ కేసు సేలం కోర్టులో విచా రించి ఖయిదైన పన్నెండు మందినీ హాజరుపరిస్తే కుప్పనుకు ఏడేళ్ళు వేసి మిగతా వారిని వదిలేసిందట కోర్టు. ఇది మద్రాసు హైకోర్టులో విచారిస్తూ న్యాయమూర్తులు కుప్పన్‌కు యావజ్జీవశిక్ష విధించారట. అశోక్కుమారుకు, అతని స్నేహి తుడు గోపాల్ అనే అతనికి కూడా శిక్ష వేసివుండా ల్సింది. కాని, క్రింది కోర్టులో వారికి శిక్ష వేయ కుండా వదిలివేయడం చాలా ఆశ్చర్యకరంగా వుంది. వారిని దండించాలని ప్రభుత్వం కూడా కోర్టును కోరక పోవడం మరింత ఆశ్చర్యకరంగా వున్నది. చట్టప్రకారం విచారణకు రాని విషయంలో క్రింది కోర్టు నిర్ణయాన్ని తోసిపుచ్చి తీర్పు చెప్పే అవకాశం హైకోర్టుకు లేదు. అన్నారట న్యాయమూర్తులు.

## వేలం వెర్రి!

ఫ్రాన్సుదేశంలో 1843 లో తయారు చేసిన ఓ పేపర్ వెయిట్ ఇంగ్లండ్‌లో వేలం వేస్తే ఎవరో ఒకాయన ముప్పయివేల డాలర్లిచ్చి పాటలో ఆ పేపర్‌వెయిట్‌ని సొంతం చేసుకున్నాడట. అందుకే దీన్నంతటినీ, ఇలాంటి వాటిని చేర్చి మన వాళ్ళు ఎప్పుడో వేలంవెర్రి అనేశారు.

## ఆస్తికోసం తమ్ముణ్ణి హత్య చేసిన అన్న

తిరుచ్చి జిల్లా అరియలూరుకు చెందిన వీరస్వా దారు కొడుకులు 27 ఏళ్ల పిచ్చయ్యకు, 12ఏళ్ళ చిన్నప్పుడుకు తండ్రి ఆస్తి వచ్చిందట. ఆస్తంతా తనకే వస్తే ఎంత బాగుణ్ణు అని పిచ్చయ్య ఆలో చించి ఏదో పని మీద పక్క వూరికి వెళ్ళిన తమ్ముణ్ణి దారి కాసి, చంపేసి చక్కా వచ్చేశాడట. తమ్ముడు తిరిగి ఇంటికి రాలేదని ఆత్రం ప్రక టించాడట. మూడ్రోజులయ్యాకెవరో శవాన్ని చూసి పోలీసులకు తెలియచేస్తే వారు విచారించి పిచ్చయ్యను అరెస్టు చేశారట.

## బైబిల్ పఠనంలో ప్రపంచ రికార్డు

ఆస్ట్రేలియాలో అడిలియాడ్ నగరానికి చెందిన ఓ ఆసామీ బైబిలును అమాంతంగా గుక్క తిప్పుకోకుండా 62 గంటల, 36 నిముషాలలో చదివి సంపూర్ణంచేసి ప్రపంచ రికార్డు స్థాపించాడట.

## అనుమానం పెనుభూతం

మాయవరం అనే వూరికి చెందిన మనోహరన్ అనే అతను తన భార్య 24 ఏళ్ళసావిత్రి ప్రవర్తన మీద అనుమానం పెంచుకుని, అది నమ్మకంగా మార్చుకుని, నిద్రపోతున్న ఆమెను పీకనులిమి చంపేసి, చెత్తకుప్పపేకి, అందులో ఆమె శవాన్ని పెట్టి, చెత్తాచెదారమంతా పైన కప్పేశాడట. శవం కుళ్ళి వాసనవచ్చి అంతా తెలిసి, పోలీసులాతన్ని అరెస్టు చేశారట.












# వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్

100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన తల్లులకు విశ్వాసపాత్రమైనది.

వుడ్‌వర్డ్స్ కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.

CAS.OPPL-1-TE 77

# జీవన పోరాటంలో— ఆశల ఆరాటం

సీరియల్ పి. వి. ఆర్. శివకుమార్

**చిక్కని చీకటు వూరంతా అలుముకుంటున్న వేళ....**
**అప్పుడే వచ్చి స్టాండులో ఆగిన బస్‌లోంచి దిగాడు భానుమూర్తి.**

బస్టాండన్న పేరేగానీ — బందిల దొడ్డిలా వుంది. పేరుకి దీపాలువున్నా, అక్కడొకటీ, అక్కడొకటీ మాత్రమే వెలుగుతూ చీకట్లని పారద్రోలటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాయి. మధ్యాహ్నం వాన కురిసిందని యింకా చాటిచెబుతూ, నేలంతా బురదగా వుంది. బస్టాండ్‌కీ, మెయిన్‌రోడ్డుకీ మధ్యగా జీవనదిలా పారుతున్నది మురుగు కాలవ.

తన సూట్‌కేస్ చేతిలో పట్టుకుని, రద్దీగావున్న స్టాండులోంచి జనాన్ని తప్పించుకుంటూ నెమ్మదిగా బయటపడ్డాడు భానుమూర్తి. 'రిక్షా కావాలాయ్యా-రిక్షా' అంటూ వెంటపడ్డారు రిక్షావాళ్లు.

కాస్త రోడ్డుమీదకు వచ్చేక ఆగి, "షుగర్ ఫాక్టరీదగ్గరికి వస్తావా ?" అనడిగాడు ఒక రిక్షావాణ్ణి. వాడు భానుమూర్తిని ఎగాదిగా చూసి, "రెండున్నర యిప్పించండి" అన్నాడు

"రెండు రూపాయిలన్నరా ?"

"అవును బాబూ! షుగర్ ఫాక్టరీ అంటే ఇక్కడుందేటండీ ? ఊరి బయటికి పోవాల! మళ్లా తిరుగు బేరాలుండవు."

"సరేలేవోయ్ — అయితే మాత్రం ? రూపాయిన్నర యిస్తాను. పద." అన్నాడు విసుగ్గా భానుమూర్తి. అయిదు నిమిషాలు బేరమాడి, చివరికి రెండు రూపాయలకి రిక్షా కట్టాడు అతను.

సినిమాథియేటర్లు దాటుకుని, సందులు, గొందుల్లోంచి పడి నడుస్తోంది రిక్షా.

బస్సు ప్రయాణం చేసి రావడంవల్ల భానుమూర్తికి అలసటగా వుంది. కొత్త చోటికి మొదటిసారి వెళ్తుండటాన బెరుగ్గా వుంది. ఆ వెళ్లేదికూడా ఏదో చుట్టం చూపుగాకాక, మామయ్య గార్డియన్‌షిప్ అంగీకరిస్తూ వెళ్ళాల్సిరావటాన భయంగా, తిక్కగా వుంది.

'అసలు నాన్నకి బుద్ధిలేదు. అమ్మకి అంతకన్నాలేదు. ఇద్దరికీ కలసి తనంటే కొంచెమన్నా ప్రేమాభిమానాలు లేవు. అలాటిదేదన్నా వుంటే తనివాళ యీ పరిస్థితిలో యిరకాల్సి వచ్చేదికాదు.

ఛీ... ఛీ... ఎంత పడకపోతే మాత్రం కన్నకొడుకుని యిలా పరాయి పంచలపాలు చేస్తారా ఎవరయినా ?

పోనీయ్ — తనేం తెలివితక్కువవాడు కాదు. వాళ్లకి చేతనయిన విధంగా వాళ్లిప్పుడు తనని శిక్షిస్తున్నారు — శిక్షించనీ! తనకీ చెలాయించే రోజు రాకపోదుగా! — ఆ రోజు తను చేయవల్సిందేదో తనూ చేస్తాడు!...

అసలు తను మొదట్లో యిక్కడికి రావాలనికూడా అనుకోలేదు. సూట్‌కేసు, చేతిలో డబ్బుతో ఎటన్నా పారిపోదామని అనుకున్నాడు. కానీ ఆలోచించిన కొద్దీ అదంత మంచిపనిగా తోచలేదు. దానివల్ల తను ఎప్పటికీ పైకి రాలేకపోవచ్చు — అరుదయిన అదృష్టమేదో కలిసొస్తే తప్ప! అంతకన్న వాళ్లు చెప్పినట్లే వింటూ, చదువుతోబాటు జల్సాలూ సాగిస్తూ — వాళ్లని యింకా బాగా ఏడిపించటం మంచిది కదూ!'

భానుమూర్తి, తల్లిదండ్రులమీద తనకి ఏర్పడ్డ శత్రుభావాన్నంతా ఆలోచనల్లో నింపుకు యోచిస్తుండగానే— ఊరిబయటికి వచ్చేసింది రిక్షా. షుగర్ ఫాక్టరీ దగ్గర పడిందని తెలిసేలా కమ్మని సువాసనలు వీచసాగాయి. చెరుకుబళ్ళుకూడా రిక్షాకి అడ్డం వస్తున్నాయి. చూస్తుండగానే బళ్లని తప్పుకుని షుగర్ ఫాక్టరీ ముందుకి వచ్చేసింది రిక్షా.

"ఎటు పోవాలి బాబూ ?" అంటూ అడిగిన రిక్షావాడి మాటల్తో ఆలోచనల్లోంచి బయటపడిన భానుమూర్తి, పరిసరాల్ని పరికించి "కాలనీకి వెళ్లాలి. ఛీఫ్ ఇంజనీరుగారింటికి." అన్నాడు. రిక్షావాడు రోడ్డుమీద నడుస్తున్న జనాల్ని వాకబు చేస్తూ, రిక్షా ఛీఫ్ యింజనీరు గారింటికి నడిపించాడు.

'వై. శంకర్రావు బి. ఇ' అన్న బోర్డు చూస్తూ—"ఇదేయిల్లు. ఆపు..." అంటూ రిక్షా దిగాడు భానుమూర్తి. సూట్‌కేస్ చేతిలోకి తీసుకోబోతున్న అతణ్ణి వారించి, తనే దాన్నందుకుని, అతనికి డబ్బులిచ్చి పంపేసి, గేటు తెరుచుకు లోపలికి అడుగు పెట్టాడు. పెద్ద కాంపౌండ్‌లో డాబా. వరండా దాకా గచ్చుబాట వుంది. బాటకి రెండువైపులా పూలమొక్కలు అందంగా పెరిగి వున్నాయి.

బెరుకు, బెరుగ్గా వరండా దాకా నడిచి, అక్కడున్న కాలింగ్ బెల్ నొక్కాడు భాను. 'బౌ'య్' మంటూ పరుగెత్తుకు వచ్చిన అల్సేషియన్ తో పాటూ, 'ఏయ్, టైగర్' అంటూ వరండాలోకి వచ్చింది ఓ అమ్మాయి. ఆ అమ్మాయిని చూస్తూనే భాను కళ్ళు గుర్తింపుగా మెరిశాయి.

"ఎవరు కావాలి ?" అంటూ ఆమె అడిగిన ప్రశ్నకి—"నువ్వు ... నువ్వు రాధవి కదూ ?" అన్నాడు ఉత్సాహంగా.

తనకి తెలియని మనిషి, అంత చనువుగా పలకరించటం ఆశ్చర్యం కలిగించగా, "అవును. నువ్వు...?" అంది రాధ.

"నన్ను గుర్తుపట్టలేదా ? నేను మీ సాంబయ్య మామయ్య కొడుకు ... భానుమూర్తిని!"

"ఓ...భానువి! ఔను. రా ... రా ... అమ్మని పిలుస్తానుండు! అమ్మా..." అంటూ లోపలికి పరుగెత్తింది రాధ. ఆమె పిలుపు వింటూనే బయటకు వచ్చిన కౌసల్య భానుని చూస్తూనే అభిమానంగా, "రా భానూ! అలా పరాయి చోటల్లే నిలబడిపోయావేం ? గుర్తుపట్టలేదుటే రాధా—మీ బావ—" అంది.

**ప్రారంభం!**



''అవును. బావే పరిచయం చేసుకున్నాడు.'' అంది రాధ.

''అమ్మా, నాన్నా అంతా కులాసాయేనా? ఎప్పుడు బయల్దేరావ్? బస్సులో నే వచ్చావా? ... రెండు, మూడు రోజుల్లో వస్తావని అనుకుంటున్నాం గానీ, ఎప్పుడు వచ్చేదీ సరిగ్గా తెలీదు. ఉత్తరమన్నా వివరంగా రాశాడుకాదు మీ నాన్న! ముందు లోపలికిరా!'' హడావిడిగా మాట్లాడేస్తూ లోపలికి దారితీసిన కౌలస్య వెనకే నడిచాడు భాను.

''రాధా! వంటింట్లో ఫ్లాస్క్‌లో కాఫీ వుంది గానీ, బావకి తీసుకురా అలాగే బాత్ రూంలో స్విచ్‌గూడా వేసిరా — వేణ్ణీళ్ళతో స్నానం చేస్తాడు.'' అంటూ కూతురికి పురమాయించి, భానుని సోఫాలో కూర్చో పెట్టి, తనూ పక్కనే కూర్చుంది కౌసల్య.

''ఊఁ... ఏమిటి అక్కడి విశేషాలు? మీ అమ్మ ఆరోగ్యం ఎలా వుంది? తమ్ముడూ, చెల్లాయిలూ ఎలా వున్నారు? బడికి వెళ్తున్నారు కదూ!'' అంటూ వేసిన కౌసల్య గొలుసు ప్రశ్నలకి భాను జవాబుచెప్పే ప్రయత్నంలో వుండగానే కాఫీతెచ్చి యిచ్చింది రాధ. కాఫీ తాగేసి.

''రాజు లేడా?'' అంటూ అడిగాడు భాను.

''రాజా? వాడు లైబ్రరీకి వెళ్ళాడు. వచ్చేస్తారు వాడూ, మీ మామయ్యాకూడా కాసేపట్లో! ఇంతలో నువ్వు స్నానం కానియ్.''

భాను స్నానంచేసి వచ్చేసరికే శంకర్రావు గారూ, రాజూ వచ్చేశారు. భానుని చూస్తూనే, ''హలో'' అంటూ పలకరించాడు రాజు. అతడికీ భానుతో అంతకు ముందు అట్టే పరిచయం లేకపోయినా, కౌసల్య అప్పుడే చెప్పింది, అతను వచ్చాడనీ, బాత్‌రూంలో వున్నాడనీ!

''హలో'' అన్నాడు భానుకూడా.

''ఏమోయ్! వచ్చేశావన్నమాట. గుడ్, అంతా కులాసాయేనా?'' అనడగారు శంకర్రావుగారు.

''ఆ... బానేవున్నారండి'' అన్నాడు భాను.

ఆయన మరేం మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయారు.

మరో అరగంటలో భోజనాలకి పిలిపించింది కౌసల్య.

భోజనాల దగ్గర కదిలించారు శంకర్రావు గారు భానుని.

''ఏమోయ్, రేపు వెళ్తావా మరి — కాలేజీకి?''

''వెళ్తానండి.''

''రేపు నీతో రావడానికి నాకు వీలుపడదు. అందుకే చెప్తున్నాను. నేను మీ ప్రిన్సిపాల్‌కి ఫోన్ చేసి చెప్తాన్లే. నువ్వెళ్ళి కలుసుకో! అప్లికేషన్ యిదివరకే యిచ్చేశాం కాబట్టి, రేపు చేరిపోవచ్చు.'' అన్నారు శంకర్రావు గారు.

''ఒక్కడూ వెళ్ళగలడంటారా?''

''పోనీ—రాజుని గూడా తీసుకువెళ్ళమను

సైకిస్ట్సి. అయినా—వాళ్ళ పూర్తో జాగా తెలుసును అలవాటేగా! ఆ మాత్రం కనుక్కోలేరూ — కొత్తవాటు అయితే మాత్రం ?”

అయనెప్పు చివరి మాటలకి మనసు చివుక్కుమనగా భానువైపు చూసింది కౌసల్య. ముఖం పాలిపోగా, తల దించుకున్నాడు భాను.

“రాజా! రేపు ఉదయం టాబులెట్ పాలు [illegible] [illegible]” [illegible]

“అక్కర్లేదు. ఒక్కడ్నే వెళ్ళగలను.” విసురుగా తలెత్తి అన్నాడు భాను [illegible]

అతడి ముఖం కందగడ్డలా మారింది.

"వాడి పానికేం తక్కువలేదు..." ఇంకా ఏదో అనబోయిన శంకర్రావుగారు ... "ఏమండి! ..." అంటూ కౌసల్య వారింపుగా చూడటంతో ఆగిపోయారు.

ఆ తర్వాత మరేమాటలూ సాగకుండానే భోజనాలు పూర్తయ్యాయి. నోంచేసిలెన్నూనే అత్తయ్య చూపించిన గదిలోకి వెళ్ళి పక్కమీద వాలిపోయాడు భాను. రాజకానీ, రాధగానీ అతణ్ణి పలకరించడానికి ప్రయత్నించలేదు.

ఇల్లంతా సర్దుకుని కౌసల్య బెడ్రూంలోకి వెళ్ళేసరికే శంకర్రావుగారు పడుకున్నారు. పక్కమీదికి వాలినా ఆమెకి నిద్ర పట్టలేదు, ఆలోచనలన్నీ సాంబయ్యగారి మీదికే మళ్ళి ఆమె నిద్రని వెగొట్టసాగాయి, ఆ ఆలోచనల్లోనే అలిసి, నిద్రకి వుపక్రమించేసరికి గడియారం పదకొండు గంటలు కొట్టింది.

## 2

పదకొండు గంటలు దాటుతున్నా సాంబయ్యకి నిద్ర రావటంలేదు మధ్యాహ్నం కొడుకుని తణుకు బస్సు ఎక్కించినప్పట్నుంచీ అతడి మనసు మనసులో లేదు

సాంబయ్యకి మొదటి కొడుకు భానుమూర్తి. అతడి తరవాత మరో మగపిల్లడూ, ఆ తర్వాత ఇద్దరూ ఆడపిల్లలు. స్వతహాగా సాంబయ్య మెతకమనిషి. అందుకు తోడు మొదటి కొడుకు కాబట్టి గారాబంగానే పెంచాడు భానుని! మహాలక్ష్మమ్మ కూడా భర్తని బట్టే నడుచుకునే మనస్తత్వమే వున్నది కావటాన భానుకి గారాబంతోపాటు అల్లరీ, మొండితనమూ అలవాటు ఎడ్డాయి.

యస్. యస్. ఎల్. సి. వరకూ బలవంతాన బండి లాగించినా, అక్కడ దాటుకుపోవటం భాను తరంకాలేదు. రెండుసార్లు తప్పిన తర్వాత, అతి కష్టంమీద బయటపడ్డాడు.

ఇహ అక్కడనుంచే అతడు ముందుకి పదవటం కుదరదనిపించింది సాంబయ్యకి. కేవలం మందమతి కావటాన పరీక్షలు తప్పితే అలా అనుకోనవసరం లేదు కానీ భాను తప్పటానికి కారణం అదికాదు

చిన్నప్పటినుంచీ ఆడింది ఆట, పాడింది పాటగా సాగటంతో భాను చాలామంది ఆ వయసువాళ్ళలాగే అల్లరి చిల్లరగా తిరగటానికి అలవాటు పడ్డాడు ఖర్చులకి కావాలని తల్లిదగ్గర డబ్బు తీసుకు వెళ్తాడు కాబట్టి స్నేహాలకి కొరతలేకపోయేది. అతను తెచ్చేడబ్బుతో అతడికి స్నేహితుల్ని కొనిపెట్టేవి. పందాలు కట్టి కేరమ్స్ ఆడటం, పేక ఆడటం, గోలీలు, బచ్చాలు కొన్ని రకాలు. కాని, అన్నిటికన్న ఆసక్తికరంగానూ, 'డిగ్నిఫైడ్'గానూ వున్నదీ — ఆకర్షించినదీ — పేకాటే!




కొడుకు డబ్బుపెట్టి పేకాడుతున్నాడని తెలిసినా సాంబయ్య మందలించటం తప్ప — మాన్పించలేకపోయాడు.

కేవలం రెక్కల కష్టాన పైకివచ్చిన మనిషి సాంబయ్య తండ్రి యిచ్చిన ఆస్తి ఆరెకరాలలోనూ రెండెకరాలు చెల్లెలిపెళ్ళికే అమ్మేయాల్సి వచ్చింది తండ్రి అతడు ఇరవయ్యేళ్ల వయసులో వుండగానే పోయాడు. అప్పటికే అతడికి భార్యా, తొలిచూలు కొడుకైన భానూ వున్నారు. వీళ్లకాక, ముసలితల్లీ, పెళ్ళికెదిగిన చెల్లెలూ అదనంగా చేరారు. ఆస్తి మాటెలా వున్నా అప్పు లేకపోవటంతో నెమ్మదిగా నిలదొక్కుకున్నాడు సాంబయ్య. చెల్లెలిని ఇంజనీరింగ్ ప్యాసైన వరుడికే యిచ్చి చేశాడు. తల్లి బ్రతికిన అయిదారేళ్లూ ఆమెకి ఏ లోటూ రాకుండానే చూసుకున్నాడు. ఆ బాధ్యతల్ని నెరవేర్చుకుని వెనుదిరిగి చూసుకునేసరికి మూడెకరాల పొలమే మిగిలింది. ఆ మూడెకరాలనే సాగుబడి చేసుకు రోజులు వెళ్ళదీస్తున్నాడు. పండిన ఏడు పండి, లేనిఏడు ఎండి — సంసారం యీడ్చటం యాతనగానే వున్నా అలాగే నెట్టుకొస్తున్నాడు అయినా ఉండీ, ఉడిగీ పులిమీద పుట్రగా వచ్చే బరువుల్ని, నష్టాల్ని తట్టుకోవటానికి అప్పుడో అరా, అప్పుడో అరా అమ్మకం పెడుతూ పోతే చివరకేం మిగులుతుందోనని ఆయన భయం!

'అయినా యీ మూడెకరాల్తో ఏం సాధించగలడు తను? బావగారిలాగే తన కొడుకుకూడా ఎక్కడన్నా నాలుగు రాళ్ళు కళ్ళజూసే ఉద్యోగి అయితే తమ్ముడిన్నీ, చెల్లెళ్ళనీ అతడే చూసుకుంటాడు. తమ్మా, 'అదీ', యిక్కడే బ్రతుకులు వెళ్ళమార్చవచ్చు! ఇదీ ఆయన యోచన.

ఇన్ని ఆలోచనలు మనసులో వుండగా, వీటికి వేటికీ పొసగని విధంగా రూపొందాడు భాను! తను వాడిని మందలించనూ లేడు— అథవా మందలించినా వాడు లెక్కచెయ్యనూ బోడు! ఇటువంటి పరిస్థితిలో వాణ్ణి యీ పరిసరాల్నుంచి, యీ సహవాసాల్నుంచి దూరమన్నా చేస్తే బాగుపడతాడేమో—అని పించింది ఆయనకి.

అందుకే బావగారి దగ్గరకు పంపెయ్యాలనుకున్నాడు. శంకర్రావుగారి మీద ఆయనకి మంచి గురి వెంటనే వుత్తరం రాయించాడు. కొడుకుని ఏం చదివించాలో సలహా యిమ్మని. ఆయన సలహా మేరకు పాలిటెక్నిక్లో చేర్చాలని నిశ్చయించుకున్నాడు. వాణ్ణి తమ యింట్లోనే వుంచమని గట్టిగానే కోరింది కౌసల్య. కానీ, అంగీకరించలేదు సాంబయ్య.

'కాదులేమ్మా! వాడిని మేమే భరించలేకుండా వున్నాం. ఇంట్లో వుంచుకు మీరేం భరిస్తారు—హాస్టలయితే వాళ్ళు జాగ్రత్తలో వుంచుతారు. బావగారు గూడా కాస్త కనుక్కుంటుంటే చాలు!' అన్నాడు.

చివరికి, సీటు యిస్తామన్నారని శంకర్రావుగారి ద్వారా తెలిసి, అక్కడికి బయల్దేరదీశాడు కొడుకుని. తణుకు వెళ్లటం సుతరామూ యిష్టంలేదు భానుకి. ఈ ఆటలు, యీ ఆటవిడుపు, యీ స్నేహితులు, యీ సరదాలు, యీ స్వేచ్ఛ

## జీవనపోరాటంలో...

యివన్నీ దూరమయి పోతాయని బాధ. చదువుకోవాలంటే వికాసు. అయినా తప్పలేదు. అతడిని బస్సెక్కించి వచ్చినప్పట్నుంచి మనసు మనసులో లేదు ఆయనకి.

వయసు మీద పడుతోంది. ఆరోగ్యం మొదటినుంచీ అంత మాత్రమే. ఈ మధ్య మరీ దెబ్బతింటోందేమో అనిపిస్తోందాయనకి! ఈ వయసులో, తను గనక మూల పడితే పెద్దవాడు వాడు ఆదుకోకపోతే, భార్య మిగతాపిల్లలు ఏమౌతారో — అన్న ఆలోచన వస్తే సతమతమై పోతున్నాడు.

అయినా, యీ మూడేళ్ల కాలమూ వాడి జీవితంలో ఓ ముఖ్యమైన మలుపులాంటివి. ఈ మలుపుతో అయినా వాడి బతుకు యిప్పుడున్న గతుకులు దాటి, తిన్నని బాటలోకి మళ్లితే చాలు!'

ఆ ఆలోచనే ప్రార్థనగా మార్చుకు — దేవుణ్ణి తలుచుకుంటూ నిద్రలో పడ్డాడు సాంబయ్య.

అలవాటులేని కొత్త ప్రదేశం కావటాన, అయిదున్నరకే మెళుకువొచ్చేసింది భానుకి. ఒక్కక్షణంపాటు తనెక్కడున్నాడో అర్థం కాలేదు. లేచి, మంచంమీదే కూర్చుని, కిటికీలోంచి దృష్టి సారించాడు.

ఇంకా వెలుతురు తెరలు విచ్చుకోవటం ప్రారంభించలేదు. తెల్లవారుఝామున ఎర్వం పడుతున్నది - దొడ్లో కనబడుతున్న చెట్లన్నీ తలారా స్నానంచేసి, శిరోజాలు దులుపుకుంటున్నట్టుగా — ఆకులు కదులుస్తూ నీటి బిందువుల్ని రాలుస్తున్నాయి. చల్లగా వీస్తున్న గాలి గిరువలిని కలిగిస్తోంది.

ఆ ఆహ్లాదాన్ని అయిదు నిముషాలపాటే అనుభవించగలిగిన భానుమూర్తి, వర్తమానం — కర్తవ్యం గుర్తుకి రావటంతో హఠాత్తుగా బిగుసుకుపోయాడు.

'ఛీ... ఛీ - ఎంత మాటన్నాడు మామయ్య! వాళ్ల వూళ్లో తిరుగుడు అలవాటేగా అని, రాత్రి అత్తయ్య వారించక పోతే యింకా ఎన్ని అనేవాడో తను వూహించ

(39 వ పేజీ చూడండి)

# సామాన్యుని సణుగుడు

## "పన్నులు అదనం!"

**వ:ంద:** – అయామ్‌సారీ ! – అదే మెడికల్ షాపుల్లో "మెడిసిన్" కొనుక్కుంటాం – దానిమీద ఒక ధర వుంటుంది. ఆ ధరకి మనకా 'ఔషధం' రాదు - ఎందుకంటే రేడియో వాళ్ళు చెప్పినట్లు "పాన్నులదనం" అనగా లోకల్ టాక్సులు ఎక్స్‌ట్రా! అని అర్థం ఈ లోకల్ టాక్సులు మాత్రం ఫ్రిజ్‌డైర్ నుంచి సబ్బుబిళ్ళలదాకా దేనికైనా తప్పవు. బిస్కత్తుల మీద ధర వేసుంటుంది మరో పదిహేను పైసల నుంచి పావలా దాకా మనమీద "పాన్నులు" అదనంగా రుద్దుతాడు దుకాణదారుడు అది మన అదృష్టాన్ని – ఆ వేళా విశేషాన్ని బట్టి వుంటుందేతప్ప - అసలు ఝా స్థానిక పన్నులు ఏమిటో ఎంత శాతమో సామాన్య జనానికి తె:యదు ! బిల్లు అడిగితే కోప్పడతారు కొందరు దుకాణదారులు. మరికొందరు ఏవో రెండుమూడు తమాషా "గ్రీకు లాటిన్" లాంటి అక్షరాలు గొలికి యిచ్చేస్తారు దానిమీద సరకులు తిరిగి తీసికొనబడవు అన్న అచ్చు అక్షరాలు తప్ప తతిమ్మావి ఏవీ మనకి అర్థంకాదు !

కొనేవాడు ఇచ్చే టాక్సుకి– సేల్సుటాక్సు అన్న పేరేమిటి ? కొనుగోలుదారు చెల్లిస్తాడు కనుక కనీసం అమ్మకం పన్ను అన్న పేరు మార్చి "కొనుగోలు" పన్ను అని అనకూడదా ? మన "స్టాటస్" పెరుగుతుంది కదా

చెప్పులు, సబ్బులు, మందులు, బిస్కట్‌లు, బ్లేడ్‌లూ, షాంపులూలాంటి వాటిమీద ఏ"రేటు"న 'లోకలుటాక్సు" వెయ్యాలో తెలియజేసే అదనపు పన్నుల పట్టికలను దుకాణాల మీద కనపడే పెయింట్ అక్షరాల్లో పెట్టించే ఏర్పాటు చేయకూడదా ? ఎన్నో రకాలుగా దోపిడీ అయిపోతున్నాడు మధ్యతరగతి అర్భకుడు ఝా విధంగా కూడా ఎందుకు వాణ్ని దోచెయ్య నివ్వడం ? స్థానిక సుంకాలనేవి ఏ తీరున పడతాయో, రూపాయికి ఝా 'జిడ్డు' శాతం ఎంతో ? యిది ఎవరికి చెందుతుందో ? ఎవ్విధంబున చెందుతుందో తెలుసుకునే అవకాశం వుంటే కొంత ఆత్మక్షోభ తీరుతుంది కదా !

ఇట్లాంటి బోర్డులు పెట్టాలి అంటె మళ్లీ యమర్జన్సీ రావాలంటారా ? అయితే వద్దు బాబోయ్ ! యిలాగే రేడియో వారు వినిపించే అసభ్య అశ్లీలకరమైన తెనుగు పాటల మధ్య [వాళ్ళేంచేస్తారు ? తెనుగు సినిమా పాటల్లో ఎక్కువ అలాగే వుంటాయి ] "ఒక రుపయి తొంబై పయిస" లాంటి నాన్‌తెనుగు ప్రకటనలు వింటూ చివర చెప్పే "పాన్నులదనం" యిచ్చుకుంటాం ! ఏం చేస్తాం ?

[ వీ రా జీ ]

# దసరా మామూలు!

బాబు



అయ్యవారికి చాలు
పప్పు బెల్లాలు -
పిల్లవాళ్ళకి చాలు
ఐదు వరహాలు!




ఛ ఛ! నేనడిగేది దసరా మామూలు
కాదయ్యా బాబూ! - ఇదీ!!...




దసరా మామూలేగా! -
నేనూ దానికోసమే సాయంత్రం
బయలు దేరుతున్నాను -
నీకు రేపిస్తాను!




వంద అప్పు
తీసుకుని 75
ఇస్తున్నావేం?
ఆ
పాతిక
దసరా
మామూలండీ!




ఇయ్యాల మావ
దసరా మామూ-
ళ్ళిచ్చి సీర
తెస్తానన్నాడు!
సీర్స్!...

# ఇదిగో...సరసమైన ధరలో ఓ సాటిలేని షాంపూ

# మిస్టీ

మీ జుట్టు ఏ రకానికి చెందినది? ఏ రకమైతేనేంలెండి. ఆ జుట్టుకు తగిన ఓ షాంపూని మిస్టీ అందజేస్తుంది.

మిస్టీ బ్యూటీ షాంపూ మామూలుగా ఉండే జుట్టు కోసం. అది జుట్టును ఆమూలాగ్రంగా శుభ్రపరుస్తుంది. ఆ జుట్టుకున్న తళతళలాడే అసలైన అందాన్ని తీర్చి దిద్దుతుంది.

మిస్టీ లెమన్ షాంపూ నూనె ఓడే జుట్టుకోసం. అది మీ జుట్టుకు సజీవాకృతిని తెస్తుంది. ఆ జుట్టు పరిమళం చిందిస్తూ నవనవలాడేలా చేస్తుంది.

మిస్టీ హెర్బల్ షాంపూ పొడిగా ఉండే జుట్టు కోసం. మీ జుట్టుకు కావలసిన సహజమైన మూలపదార్థాలన్నీ గలది. మీ జుట్టును మెత్తగా, మృదువుగా, దువ్వుకునేందుకు బలే వీలుగా రూపొందిస్తుంది.

ఇదంతా .అదే సరసమైన ధరలో. బాగా ఖరీదైన షాంపూ కూడా ఇంతకన్న మేలుగా ఏంపనిచెయ్యదు.




1904వ సంవత్సరంనుండి నాణ్యమైన ఉత్పాదనలను తయారుచేస్తున్న బోస్కా యొక్క ఉత్పాదన.

# విభిన్న రూపాలలో వేర్వేరు అలంకారాలలో 'శక్తి' పూజలు వేడుకలు!
## దసరా కేవలం 'మామ్మూళ్ల పండుగ' మాత్రమే కాదు!



రాజరాజేశ్వరీ దేవి

ఉన్నదానికీ, లేనిదానికీకూడా ఆధారభూతంగా కీర్తింపబడుతున్న 'శక్తి' పూజలు వేడుకలు దసరాలో కొన్నిచోట్ల దశ రాత్రులు, మరికొన్ని ప్రాంతాలలో నవరాత్రులు జరుగుతాయి! వైభవంగా వేడుకలు, పూజలు, సంబరాలు, వేషాలు, వేషాలకి అలంకారాలకి బహుమతులు — యిట్లా గొప్ప సంబరంగా గడిచిపోతాయి దసరా వేడుకలు — 'ఢిల్లీ'లోను 'పల్లె'లోను కూడా 'దేవి'కి రోజుకో అలంకారం చేస్తారు గుంటూరుజిల్లా నూతక్కి గ్రామం కూడా సైజుకి చిన్నదైనా దసరా వేడుకలకి 1973 నుంచి చుట్టుపట్ల గ్రామాలవారు మెచ్చుకునే రీతిలో — పేర్గాంచింది!





దుర్గా భవానీ

ఆ వూళ్ళో దుర్గమ్మ గుడి లేదుకాని శ్రీ వరద వేణుగోపాలస్వామి గుడిలోనే తూర్పు తట్టున అమ్మవారికి మండపం కట్టి పందిళ్లు వేసి పూజలు, సంబరాలు చేస్తారు. ఆదిలక్ష్మి, గజలక్ష్మి, సరస్వతి, రాజరాజేశ్వరి, అన్నపూర్ణ, దుర్గాంబ, కాళికాదేవి, మహిషాసుర మర్దని అలంకారాలు దేవి 'బొమ్మ'కే చేస్తూంటారు. ఈ అలంకారాలకు అవసరమైన విగ్గులు ఆభరణాలు లాంటివి కొన్ని మద్రాసు నుంచి తెచ్చుకుంటారు మట్టితో అమ్మవారి విగ్రహాన్ని ఏటాచేస్తారు శ్రీ శ్రీనివాసుల రాఘవాచార్యులు గారు దీనంతటికీ శిల్ప వీటికి అవసరమైన 'సెట్టింగ్‌లు' హంగులు కార్టూనిస్ట్ — టీచర్ - అయిన శ్రీ కాటూరి కృష్ణమూర్తి సమకూర్చుతారు — ఈ బొమ్మలు తీసింది, పంపిందికూడా శ్రీ "కాటూరి"గారే



మహిషాసుర మర్దని



## ఎలా వ్రాయడం?

—శ్రీమతి న్యాయపతి కమల

ఎలా వ్రాయడం?
వ్రాసినవన్నీ తిరిగి వచ్చేస్తూంటే,
ఎలా వ్రాయడం?
మనసులోని భావాలన్నీ ముత్యాల్లాంటి అక్షరాలతో
కాగితంమీద పెట్టి పంపినప్పుడు
తిరిగి వచ్చేస్తూంటే అవి,
ఎలా వ్రాయడం?
కల్పించి వ్రాయడం చేతకాక
నిజాల్ని యదాతథంగా వ్రాద్దామనుకున్నా
'నిజం' తెలిసిపోతుందేమోనన్న భయంతో
ఎలా వ్రాయడం?
ఏది వ్రాసినా "నా" మీదేమోనన్న అనుమానంతో
'నా' అన్నవాళ్ళు 'నన్ను' అదోలా
కోపంగా చూస్తూంటే
ఎలా వ్రాయడం??

సీరియల్

# రాగబంధం

## యార్లగడ్డ సరోజినీదేవి

*(గత సంచిక తరువాయి)*

విజయకి ఇంట్లో ఏమీ తోచక తోటలోకి వెళ్లి మాలి చెట్లకి నీళ్లు పెడుతుంటే తను చెట్లకి కుదుళ్లు చెయ్యసాగింది.

"మీ కెందుకమ్మా ఈ శ్రమ!" మాలి నొచ్చుకున్నాడు.

"మన పని మనం చేసుకుంటే తప్పేమిటి? అయినా నాకూ ఏం తోచటంలేదని ఇలా వచ్చాను. అయినా గులాబీలు ఒక లైనులో వుండాలి! ఎక్కడబడితే అక్కడ నాటావేమిటి?" అనడిగింది.

"నేను మాలిగా రాకముందే యిలా నాటి వున్నాయి. తీసి వేరేచోట నాటితే చచ్చిపోతాయేమోనని ఆగాను!"

"సరయిన పోషణ వుంటే ఏ మొక్కా చావదు. ఆ గునపం యిలా తీసుకురా!"

అని మాలితో అడ్డదిడ్డంగా వున్నవాటిని పెకలింపచేసి సరయిన పద్ధతిలో నాటింపచేసింది. వాటికి మళ్లు కట్టి ఎరువు తెప్పించి వేసి నిండా నీళ్లు పెట్టించింది. రాలిన ఆకులన్నీ రోజూ ఊడ్చి యెత్తిపొయ్యటం మాలి వంతు! చెట్లకి నీళ్లు వదలటం విజయ వంతు! ఇద్దరూ అలా వాటాలు వేసుకున్నారు పనికి.

"మీరిలా తోటపని చేసేటప్పుడు పెద్దమ్మగారు చూస్తే ఊరుకోరమ్మా!"

"అత్తయ్య అలా అంటే జవాబు చెప్పే బాధ్యత నాది!"

"విజయా!... విజయా!..."

పార్వతమ్మ పిలుస్తూ తోటలోకి వచ్చింది. మట్టిచేతులతో వున్న విజయని చూసి కనుబొమలు చిట్లించింది.

"నువ్వు చేయకపోతే తోటపని ఆగిపోతుందా ఏమిటి? పద లోపలికి!" అంది పార్వతమ్మ.

"ఇంట్లోనూ నేను చేసే పనులు లేవు. ఏ వ్యాపకం లేకుండా వుండాలంటే విసుగ్గా వున్నదత్తయ్యా?"

"రేపటి నుంచి కాలేజీకి వెళ్లతావుగా? తోటపని కుదురుతుందా? ముందా మట్టిచేతులు కడుక్కునిరా?"

విజయ నవ్వుకుంటూ వెళ్లి పంపుక్రింద చేతులు కడుక్కుని పమిటిచెంగుతో తుడుచుకుంటూ పార్వతమ్మ దగ్గరకు వచ్చింది.

"కూర్చో విజయా! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి!"

తను సిమెంటు బెంచీమీద కూర్చుంటూ విజయని కూడా కూర్చోమని మరోసారి చెప్పింది. సిగ్గుపడుతునే మేనత్తకి ఎదురుగా కూర్చుంది.

"నీకిక్కడ కొత్తవాళ్లెవ్వరూ లేరమ్మా! సిగ్గుపడకుండా అందరితో కలిసిమెలిసి వుండాలి! అందరూ నీవాళ్లేనమ్మా!"

"అలాగే అత్తయ్యా!..."

"ఉమన్సు కాలేజీ ప్రిన్సిపాల్ శకుంతలకి ఫోన్ చేశాను. తప్పకుండా నీకు సీటు యిస్తానన్నది. రేపు నేనే వెంటబెట్టుకుని వెళ్తాను నిన్ను! శ్రద్ధగా చదవాలి! శ్రీనివాస్‌ని నువ్వు చూశావుగా! వాడు కొంచెం తొందర స్వభావం గల మనిషి. వాడేదన్నా తొందరపడి అన్నా; కావాలనే అన్నాడని మాత్రం బాధపడవద్దు! ఎంత గబగబలాడుతాడో అంత తొందరగా మనసు మార్చుకుని జాలిపడటం కూడా వాడి స్వభావం. ఇతరులు బాధపడితే తను సహించలేనంత సున్నిత హృదయుడు. నిన్ను కావాలని ఈ ఇంటికి తీసుకువచ్చిందికూడా శ్రీనివాస్ కోసమేనమ్మా! మీ అమ్మ నాకు చేసిన సహాయానికి నేనీ జన్మలో ఋణం తీర్చుకోలేను. ఇలాగయినా నిన్ను నా చిన్నకోడలిగా చేసుకుని మీ అమ్మ ఋణం ఈ విధంగానైనా తీర్చుకోవాలనిపించింది. శ్రీనివాస్ గురించి నువ్వు శ్రద్ధ తీసుకోవాలి! వాడికి స్నేహితులు ఎక్కువ! తిరగటం ఎక్కువ! ఏదీ బాధ్యతగా తీసుకోలేదు. వాడిని గురించే నా బాధంతాను. పెదబాబు భాస్కర్ గురించి నాకెలాంటి బాధా లేదు. నిదానమే ప్రధానం వాడి గుణం. ఒకింటివాడయ్యాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. సుందరిది అదో రకమయిన మనస్తత్వం! గర్వం కొంచెం ఎక్కువ! తనకంటే తక్కువ స్థాయిలోని వాళ్లు కనిపించరు. నువ్వే సర్దుకోవాలి విజయా!!"

"అదేమిటత్తయ్యా! మీరింతగా చెప్పాలా? బావలుని నేను చిన్నప్పటినుంచీ ఎరుగకపోయినా నాకు పరాయివాళ్లు కారుగా? వాళ్లేమయినా అంటే బాధపడటానికి?..."

"మీ మామయ్య మాటలు విన్నావుగా? వాడిని మందలించని క్షణం లేదు. అదే వాడికి కోపం!..."

"పెద్దవాళ్లు అలాగే కోప్పడుతారు అత్తయ్యా! అది తన మంచికేనని చినబావ అర్థం చేసుకుంటే చాలు!..."

"బాగా చెప్పావు విజయా! శ్రీనివాసుని నువ్వయినా అర్థం చేసుకుంటే నాకదే చాలు! నేనివన్నీ చెప్పినట్టు మనసులోనే వుంచుకో!"

"అలాగే అత్తయ్యా! అనాధనయిన నాకింత నీడను యిచ్చిందికాక నామీద పెద్ద బరువు బాధ్యతలనుకూడా మోపావు!"

"అలా అయితేనే వాడిని నువ్వు మార్చగలిగేది! నీదన్న వస్తువుమీద నీకున్న శ్రద్ధ మరొకరికి వుండదు విజయా? మీ ఇద్దరూ ఒకింటివాళ్లు కావాలంటే వాడి బాగోగులన్నీ నువ్వే ఓ కంట కనిపెడుతుండాలి! ఈ ఇంటిలో నా తరువాత స్థానం నీదేనమ్మా!!"

"అత్తయ్యా?" ఆనందాతిరేకంతో పిలిచింది విజయ. రెండు క్షణాలు ఆగి నెమ్మదిగా అంది — "చినబావ విషయంలో ఒక్కోసారి కఠినంగా వుండవల్సివస్తే మీరేమీ బాధపడకూడదు అత్తయ్యా?"

"అలాగేనమ్మా!! నేనేమీ అనుకోను! వాడికి డబ్బు విలువ తెలిసేలా చేయటమే నాకూ కావలసింది!"

విజయ ఆలోచిస్తూ తల పంకించింది. తానింత శుభవార్త వింటానని కలలో కూడా వూహించలేదు. తానంత అదృష్టవంతురాలు ఇంకెవ్వరూ వుండరు! సంతోషంతో మనసు ఊగిపోతోంది. కారు హారన్ విని తల తిప్పి చూసిన పార్వతమ్మ రామనాథం కారు దిగటం చూసి తోటలోనుంచి వెళ్లిపోయింది. ఆ సిమెంటు బెంచీమీద ఒంటరిగా కూర్చున్న విజయ మనసు ఒక తియ్యని అనుభూతికి లోనయింది.

**జరిగిన కథ:** ముప్ఫయ్యేళ్లతర్వాత పుట్టింటి కెళ్లిన పార్వతమ్మ వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకు వస్తుంది. తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మే నని రామనాథం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి. సుందరికి నల్గురితో కలసిమెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకు తనం ఎక్కువ. పాతికేళ్ల క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాధం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్లకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాథంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్లు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. చదవాలనుకుంటుంది.

అత్తయ్య నిజంగానే పిచ్చిది అమ్మ అన్నట్టు! కొడుకుని గురించి చెప్పకపోతే మందలించి మనిషిని చేయకూడదూ? అయినా అత్తయ్య మాటలేనా? లేక అందరికీ తనమీద అత్తయ్యకి కలిగిన అభిప్రాయమే కలిగిందా?? రకరకాల మనస్తత్వాలు గల ఈ మనుష్యుల మధ్య తన పాత్ర ఏపాటిది?? తనేవిధంగా ఈ ఇంటిలో నడుచుకోవాలి?

## రాగబంధం

అత్తయ్య బాధల్లా శ్రీనివాస్ తొందర స్వభావం గురించే! క్రమేపీ అతన్ని మార్చగలిగితే??... కాదు! మార్చుకోగలిగితే?? ఆ సాయంత్రం మేడమీద శ్రీనివాస్ తనవంక అదోలా చూడటంతో విజయకి అతనియందు గౌరవభావం కలుగలేదు. అయినా అతన్ని మార్చుకోవాలన్న కోరిక కలిగింది ఆ క్షణంలో!!... ...

### 7

కాలేజీలు నెల రోజుల క్రితం తెరిచినప్పటికీ విద్యార్థినీ విద్యార్థుల కోలాహలం తగ్గలేదు. కాలేజీ సిబ్బందికి క్షణం విశ్రాంతి లేనట్లుగా వున్నది.

విజయకి వారం రోజులు పుస్తకాలు, కావలసిన బట్టలు కుట్టించుకోవటంతో గడిచి పోయింది మరో వారం రోజులకు క్లాసులు ప్రారంభించటం మొదలుపెట్టిన తరువాత ఉదయం వెళ్లిన విజయ తిరిగి సాయంత్రం ఇంటికి వచ్చేది మధ్యాహ్నం కారియరు శ్రీనివాస్‌కి విజయకి మాం తెచ్చి యిచ్చేవాడు రామనాథం తను ఆఫీసుకి వెళ్తూ విజయని ఉమన్సు కాలేజీ దగ్గిర డ్రాప్ చేసి వెళ్లేవాడు! సాయంత్రం వస్తే బస్సుమీదగాని రిక్షామీదగాని ఇంటికి చేరేది శ్రీనివాస్‌కి స్కూటరున్నది ఉదయం వెళ్లినవాడు రాత్రి ఏడున్నర దాటితేనేగాని యిల్లు చేరేవాడు



కాదు! అదేమిటని పార్వతమ్మ అడిగితే ఏదో ఒక సమాధానం యిచ్చి తన గదిలోకి వెళ్లిపోయేవాడు ఆ సమాధానం, చెప్పే తీరు విజయకి అంత రుచించేది కాదు! విజయ వచ్చి నెల రోజులయినా, ఇద్దరూ ఒకే ఇంటిలో వుంటున్నా యింతవరకూ ముఖాముఖీ మాట్లాడుకుని ఎరుగరు మాట్లాడు కోవాలని ఇద్దరికీ మనసులో వుండేది ఎవరు ముందు చొరవ చెయ్యాలో తెలియలేదు ఇద్దరికీను

అలాగే మరో మూడు నెలలు గడిచిపోయాయి సుందరికి శ్రీనివాస్ కొన్ని నవల్సు ఏరి యిచ్చేవాడు వాటిల్లో తనకి కావలసిన సెక్సు నవల్సు ఎవరినీ చూడకుండా జాగ్రత్త పడేవాడు శ్రీనివాస్ ఎంత జాగ్రత్త పడినా విజయ అవి ఎలాంటి నవల్సో గ్రహించేది శ్రీనివాస్ అంటే ఒక విధమయిన జుగుప్స కలిగేది తనతో మాట్లాడని శ్రీనివాస్‌కి తనేమని చెప్పతుంది? సుందరి కూడా ఎప్పుడూ నవల చేతిలో వుండవలసిందే! పిచ్చిగా చదివేవాళ్లు వుంటే పిచ్చి పిచ్చిగానే వ్రాస్తున్న నవల్సుకి గిరాకీ వుండటంలో తప్పేమున్నది? చదువుకోవచ్చును గాని మరీ పిచ్చి వ్యామోహం వుండకూడదు

ఒక రోజు సాయంత్రం బస్సు కోసం స్టాప్‌లో నిలబడింది విజయ తను వెళ్లే బస్సు వచ్చినా కిక్కిరిసి వుంటంవల్ల మరొక బస్సు, మరొక బస్సు అనుకుంటూనే అరగంట నిలబడిపోయింది వాళ్లనందరినీ రాసుకుంటూ ఇరుకులో వాళ్లమధ్య నిలబడటానికి ఇష్టమవక కాళీగా వచ్చే బస్సుకోసం ఎదురు చూడసాగింది ఏదీ కాళీగా రాకపోవటం చూసి విసుగుపుట్టిన విజయ నడక మొదలుపెట్టింది కొద్ది దూరం నడిచి కాళీగా వెళ్తున్న రిక్షాను కేక వేయబోయి

తన దగ్గిరగా స్కూటర్ ఆగటం; ఆ వెంటనే శ్రీనివాస్ ఒక కాలు క్రింద ఆన్చి నిలబడటం చూసి ఉలిక్కిపడింది.

"విజయా !"

"ఊఁ ..."

శ్రీనివాస్ చేతులను స్కూటర్ హాండ్పుమీద మోపి విజయ వంక చూసి నవ్వాడు. అదే మొదటిసారి కావటంవల్ల విజయకి మాట్లాడటానికి సంకోచం కలిగింది. ఏమిటన్నట్లుగానే కళ్లతోనే ప్రశ్నించింది.

"నేనిప్పుడు ఇంటికి వెళ్తున్నాను !" అన్నాడు అదే చిరునవ్వుతో.

"నేను వెళ్లేది కూడా ఇంటికే ! ..." తల వంచుకుని జవాబిచ్చింది.

"ఇద్దరం కలిసే వెళ్లుదాం రా ?" అన్నాడు స్కూటర్ వెనుక సీటు వేలితో చూపించుతూ !

"రోడ్డుమీద మీ వెనుక కూర్చుని స్కూటర్ మీద రాలేను !"

"ఏ ? ... ఎందుకని ?" శ్రీనివాస్ కనుబొమ్మలు ముడివడ్డాయి.

''చెప్పానుగా? రాలేనని!''

''ఉహూం! అలాగా? మర్యాదగా పిలిస్తే మీ ఆడవాళ్ళకి కళ్ళు నెత్తిన వుంటాయిలే!''

చురుగ్గా శ్రీనివాస్ కళ్ళల్లోకి చూసింది విజయ. ఆ చూపులనేమీ లక్ష్యపెట్టలేదు శ్రీనివాస్.

''కళ్ళు నెత్తినకాదు! సభ్యతకాదని!''

''మర్యాద తెలియనివాళ్ళకి ఏదీ సభ్యత కాదనే అనిపించుతుంది!''

హేళనగా నవ్వుతూ గేరు మార్చి విసురుగా ముందుకు వెళ్ళిపోయాడు ఆఘమేఘాల మీద అన్నట్టు!

అంతలోనే నవ్వు! అంతలోనే కోపం? ఆవేశపరుడు అత్తయ్య అన్నట్టు! అతని బుజాల మీద చేతులువేసి వెనుక సీటుమీద కూర్చోవాలంటే యెంత సిగ్గు? తామేమన్నా భార్యాభర్తలా? అలా కూర్చుని స్కూటర్‌మీద ప్రయాణం చెయ్యటానికి? అసలు అలాంటి ఊహే విజయకి భరింపరానిదిగా వున్నది. ఇంకెలా వెళ్ళుతుంది? ఇద్దరికీ పరిచయం అయిందే ఇప్పుడు. ఆ పరిచయంకూడా కలహంతోటే ప్రారంభమయింది. చివరికి యెలా ముగుస్తుందో? అలా శ్రీనివాస్‌ని గురించి ఆలోచిస్తూనే ఇంటికి చేరింది నడిచి.

లోపలికి అడుగు పెట్టేసరికి శ్రీనివాస్ హాలులో పచార్లుచేస్తూ కనిపించాడు. పార్వతమ్మ సోఫాలో కూర్చున్నది. విజయను చూస్తూనే చిన్నగా నవ్వింది. శ్రీనివాస్ వుండటంవల్ల తల వంచుకుని తన గదిలోకి వెళ్ళి పుస్తకాలు డ్రాయర్ మీద వుంచి ఆలసటగా కుర్చీలో కూర్చుంది.

''ఎదుట మనిషి మాటకి మర్యాద యివ్వటం అనేది నీ మేనకోడలికి నేర్పమ్మా!''

అన్న శ్రీనివాస్ మాటా! అ వెంటనే పార్వతమ్మ నవ్వూ వినిపించేసరికి ఆమాట శ్రీనివాస్ తనను ఉద్దేశించే అంటున్నాడని ఇట్టే అర్థమయి పోయింది విజయకి. ఆడపిల్లని తన వెనుక కూర్చోపెట్టుకుని వెళ్ళటానికి తనకి మర్యాద లేకపోతే కూర్చునేందుకు తనకయినా మర్యాద వుందని శ్రీనివాస్ గ్రహించగలిగితే బాగుండును అనుకుంది విజయ.

''నేర్పుతానుగాని; ఈమాట మీ నాన్నగారు వింటే నిన్ను నేర్చుకోమంటారు శ్రీనూ?''

మేనత్త సమాధానం విన్న విజయ సంతృప్తిగా కళ్ళు మూసుకుంది.

''నన్ను నేర్చుకోమంటారు? డాడీ చూపంతా నామీదనేగా? అనకేంచేస్తారు. ఆమధ్య ఇలాగే విజయ! అంటే అదే! నీ మేనకోడలు ముందు నన్ను అవమానించారు. చెప్తాను ఆ అవమానానికి జవాబు!''

మరుక్షణంలో కారిడార్‌లో స్కూటర్ స్టార్టు అవటంతో ఉలిక్కిపడింది. ఈవేళప్పుడు శ్రీనివాస్ ఎక్కడికి వెళ్తున్నాడు? కాలేజీ నుంచి వచ్చిన తరువాత కాసేపు తోటలో గడిపి ఆ తరువాత చదువుకునే టైం!... అదేమిటని అత్తయ్య మందలించదేం? కాలేజీ నుంచి ఎప్పుడు వస్తాడో? ఏం చదువుతున్నాడో ఆ భగవంతునికే యెరుక! చిన్నబావ అంటే వుండే ప్రేమవల్ల అత్తయ్య గట్టిగా మందలించలేకపోతోంది. కర్టెన్ అవతల అడుగుల చప్పుడు వినిపించి ఛప్పున కుర్చీలో నుంచి లేచి నిలబడింది విజయ. పార్వతమ్మను చూసి చిన్నగా నవ్వింది.

''ఏమ్మా విజయా! శ్రీనివాస్ స్కూటర్ మీద రమ్మంటే రాలేదటగా?'' అనడిగింది పార్వతమ్మ.

''అవునత్తయ్యా!''

''వాడి మాట కాదంటేనే వాడికి కోపం వస్తుందమ్మా!''

''చినబావకి కోపంవస్తే రానివ్వు అత్తయ్యా! స్కూటరెక్కి రాగలంత చనువు సామర్థ్య లేదు! నేనంత నాగరికత నేర్చుకోలేదు!''

''శ్రీనివాస్ నీకేమీ పరాయివాడు కాదుగా? యిప్పుడు కాకపోతే మరొకనాడయినా మీ ఇద్దరూ కలిసిమెలిసి వుండవలసినవాళ్ళే కదా?''

''అలాగని యిప్పటినుంచీ పాముకుతిరగాలని నాకు లేదత్తయ్యా!''

అనాలనుకుని అనలేకపోయింది విజయ. అలా విజయ మౌనంగా వుండేసరికి పార్వతమ్మకి నవ్వు తెప్పించింది.

''మీ యిద్దరిమధ్యా నేను రాయబారిని కాదమ్మా! ఇంకెప్పుడూ వాడి మాట కాదనకు విజయా!'' అంది పార్వతమ్మ మేనకోడలి బుజంమీద చెయ్యివేసి!

''అలాంటి పద్ధతులు నా కిష్టంవుండ వత్తయ్యా! చినబావకి కోపం వచ్చినా కొన్ని విషయాలకి వ్యతిరేకిని నేను!''

విజయకు కోపం వచ్చిందని గ్రహించిన పార్వతమ్మ మాట మార్చింది —

''కాలేజీ చదువు యెలావుందమ్మా?'' అనడిగింది.

''బాగానే వున్నదత్తయ్యా!''

''బాగా చదువుకోమ్మా!'' అంటూ వెళ్ళి పోయింది పార్వతమ్మ. మేనత్త వెళ్ళగానే తన బట్టలు తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది విజయ. మేడమెట్లు దిగుతున్న సుందరి అత్తగారు విజయ గదిలోనుంచి రావటం చూసింది. విషపూరిత మయిన నవ్వు సుందరి పెదాలమీద ఓ క్షణం ప్రస్ఫుటించి మాయమయింది.

''అత్తగారు మేనకోడలిని యింకా మచ్చిక చేసుకున్నట్టులేదే?'' అనడిగింది.

''మచ్చిక ఏముందమ్మా! విజయకి కొత్తకదూ? శ్రీనివాస్‌కి కోపం యెక్కువ! యెందుకయినా మంచిదని!''

''ఇద్దరికీ రాజీ కుదిర్చే ప్రయత్నం చేస్తున్నారన్నమాట?''

''రాజీ ఏముందమ్మా! వాడేదో అడిగాడట! విజయ కాదన్నదట!''

''తన స్కూటరెక్కమని శ్రీనివాస్ అడిగితే యెక్కనన్నదట విజయ. నేనలా అడగటం తప్పా వదినా? అని నన్నడిగాడు వచ్చి! యిందులో తప్పేమున్నదన్నాను. ఈపాటికే తన పవిత్రత చెడిపోతుందా ఏమిటి?'' అంది సుందరి మూతి తిప్పుతూ.

పార్వతమ్మ జవాబు చెప్పాలనుకుంటుండగా విజయ తన గదిలో నుంచి హాలులోకి వచ్చింది. తెల్లనిచీర; బ్రౌన్‌కలర్ జాకెట్టు వేసుకుంది. పువ్వులుకోసమని సజ్జ తీసుకుని తోటలోకి వెళ్ళబోయి ఆ యిద్దరినీ చూసి హాలులోనే ఆగిపోయింది. మల్లెపువ్వులా స్వచ్ఛంగా; శుభ్రంగా వున్న విజయను చూస్తూవుండిపోయింది సుందరి. ఇద్దరూ మాట్లాడకపోవటం చూసి —

''అత్తయ్యా! తోటలోకి వెళ్తున్నాను పువ్వులకోసం!''

అని పార్వతమ్మకి చెప్పి బైటికి వెళ్ళిపోయింది విజయ.

''నీకుకూడా పువ్వులు కోసుకురానా? అనడిగిందేమో చూడండి అత్తయ్యా? యెంత పొగరో?'' అక్కసుగా అంది సుందరి.

[36వ పేజీ చూడండి]







## సినిమా

**నలుగురు పెద్దలు !**

ప్రేక్షకులకు యీ వారం కొత్త రకం న్యూస్‌ను అందివ్వడానికి ప్రయత్నిస్తున్నాను అభిమానించే లక్షలాది పాఠకులు, వారి కథానాయక నటుల చిత్ర వివరాలను తెలుసుకోవడానికి సంతోషిస్తారు

పరిశ్రమలో పెద్ద నటులుగా, ప్రజలలో పలుకుబడి గల నటులుగా నలుగురిని పేర్కొన వచ్చు శ్రీ నాగేశ్వరరావు.. శ్రీ రామారావు . శ్రీ శోభన్ శ్రీ కృష్ణ

హీరో యిమేజ్‌ను ఆర్జించుకున్న యీ నలుగురికి ఎదురుదెబ్బలు అప్పుడప్పుడు తగులుతున్నా, వారి స్థానం మాత్రం అన్యాక్రాంతం కావడం అసంభవం నే చెప్పిన నిజాన్ని అందరూ ఆమోదించగలరు

**సూపర్ యిమేజ్**

ఒక్కో సంవత్సరం ఒక్కొక్క కథానాయకుడు ''సూపర్ స్టార్'' యిమేజ్‌ను అనుభవించడం, అందరు ఎరిగిన నిజం

''దసరాబుల్లోడు'' సమయంలో శ్రీ అక్కినేని, ''అల్లూరి సీతా రామ రాజు'' సమయంలో శ్రీ కృష్ణ, ''సోగ్గాడు'' సమయంలో శ్రీ శోభన్‌బాబు, ''అడవిరాముడు'' సమయంలో ఎన్టీ రామారావు యిలా నలుగురు నాయకులు ప్రజల అభిమానధనాన్ని సంపాదించుకున్న నిజం పాఠక విదితం

ఒకరు మరొకరికి పోటీ అని ఎవరయినా అనుకుంటే, అది ఆత్మవంచనే అవుతుంది నలుగురికి ప్రజలలో పలుకుబడి వున్నది నూరు శాతం నిజం గాబట్టి, ఎవ్వరూ ఎవ్వరినీ ఏమీ చెయ్యలేరు ప్రస్తుతం యీ నలుగురు చేస్తున్న చిత్రాలు ఎన్ని, వాటి సాంకేతిక సారథులు ఎవరు అనెడి వివరాలను యిక్కడ పొందుపరుస్తున్నాను

**శ్రీ నాగేశ్వరరావు !**

విజయమాధవీ పిక్చర్స్‌వారి వర్ణచిత్రంలో అక్కినేని మొదటి సగంలో సాత్విక స్వభావం గొన్న వుత్తముడుగా, రెండో సగంలో దుష్టుల అహంకారాన్ని అణచిన కుటుంబ మిత్రుడుగా నటించారు జయచిత్ర, మాధవి, వై విజయ, జయమాలిని, హలం, ఛాయాదేవి, సత్యనారాయణ, మురళీమోహన్, రావు గోపాలరావు, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, రాజబాబు ప్రధాన పాత్రలను పోషించారు

చిత్రంలోని ఆరు పాటలలో నాగేశ్వరరావు. . జయచిత్రగార్లు పాల్గొన్న మూడు ప్రేమ గీతాలు యువతరాన్ని వుత్తేజపరుస్తాయి ఒక పాట



శ్రీ జగ ఫొంగ్రఖల



శృంగార నాయకుడుగా ఒకవంక, బాధ్యత తెలిసిన డాక్టరుగా మరొకవంక నటిస్తున్నారు.

''అగ్రనటి'' వాణిశ్రీ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండే ''చిలిపికృష్ణుడు'' చిత్రానికి బోయిన సుబ్బారావు దర్శకుడు.

''ప్రేమనగర్'' చిత్రం వలె, ''చిలిపి కృష్ణుడు'' చిత్రంలో కూడా అందరికీ రుచించే అంశాలు వున్నాయి గనక, అక్కినేనికి ఈ చిత్రం విజయ చిత్రం కాగలదు. కొత్త సంవత్సరంలో ''చిలిపికృష్ణుడు'' నవయుగ ద్వారా వస్తాడు అని శ్రీ నాయుడు తెలిపారు.

దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ అక్కినేని పుట్టిన రోజున ప్రారంభించిన ''దేవదాసు మళ్ళీపుట్టాడు'' వర్ణచిత్రంపై ప్రేక్షకులు ఎన్నెన్నో వూహలు, ఎన్నెన్నో ఆశలు పెంచుకుని వున్నారు.

అగ్ర దర్శకుడు శ్రీ దాసరి అన్నారు. శరత్ దేవదాసుతో పోటీపడి నెగ్గడం తమ అభిమతం కాదని, తమ శక్తిమేరకు, తమ వూహల మేరకు ఒక మంచి చిత్రాన్ని యివ్వడానికి జరిగే ప్రయత్నం మాత్రమే.

''దేవదాసు మళ్ళీ పుటా ను'' వర్ణచిత్రంలో అక్కినేని... వాణిశ్రీ... సావిత్రి... ''షావుకారు''



అక్కినేని... జయచిత్ర... సత్యనారాయణగార్లపై చిత్రీకరించబడింది. ఒక పాట మురళీమోహన్, జయమాలిని, మరొకటి అల్లు రామలింగయ్య... పాలంలపై చిత్రీకరణ జరిగింది.

''ఆలుమగలు'' ఫేమ్ శ్రీ తాతినేని కథ వ్రాసి, దర్శకత్వం నిర్వహించిన విజయ...మాధవీ పిక్చర్స్ వారి వర్ణ చిత్రాన్ని నవంబర్‌లో విడుదల చేసే ఉద్దేశ్యం, నిర్మాత శ్రీ వడ్డే శోభనాద్రికి వుంది. అన్నపూర్ణ...నవభారత్...శ్రీ తారకరామ పంపిణీదారులు.

సురేష్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న ''చిలిపికృష్ణుడు'' కూడా డిశంబర్‌కు రెడీ కాగలదని, సురేష్ అధినేత శ్రీ రామానాయుడు చెప్పడం జరిగింది.

ఈ చిత్రంలో అక్కినేని సరస స్వారస్య

శ్రీ ఉమాలక్ష్మి కంబైన్స్ హిందీ చిత్రం ''దాగ్'' ఆధారంగా నిర్మించిన ''విచిత్ర జీవితం''లో అక్కినేని రెండు రూపాల్లో నటించారు.

వీర, కరుణ...శృంగారరసభరితమైన నాయక పాత్రను అక్కినేని పోషించ, వాణిశ్రీ...జయసుధ స్త్రీ పాత్రలను నటించారు.

నవంబర్‌లో జరుగనున్న ''ఊటీ'' షెడ్యూలుతో చిత్ర నిర్మాణం పూర్తి అవుతుందని, నిర్మాతల్లో ఒకరైన భట్ తెలిపారు. ఈ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు. అన్నపూర్ణ విడుదల.

జానకి... జయప్రద ప్రధాన పాత్రధారులు.

రాయదుర్గం పాడురంగప్ప, శ్రీనివాసులు నిర్మిస్తున్న యీ పటిష్మాత్మక చిత్రాన్ని కొత్త సంవత్సర కానుకగా అందివ్వాలన్నది తారకరామ... నవభారత్... శ్రీ తారకరామగార్ల అభిప్రాయం.

**శ్రీ ఎన్టీ రామారావు!!**

శ్రీ పల్లవీ ఫిలింస్ రంగుల్లో నిర్మించిన హాస్య... శృంగార... సంగీత చిత్రం ''యమగోల'' దసరా కానుకగా విడుదల చెయ్యడానికి లక్ష్మి ఫిలింస్ నిర్ణయించింది.

నిర్మాత శ్రీ వెంకటరత్నం ''యమగోల'' వర్ణచిత్రం ద్వారా ఆర్జించే లాభం అనూహ్యమైనది... అనితర సాధ్యమైనది. చిత్రంలో వలసినన్ని పట్లు వున్నాయిగనక, వినోదాన్ని కోరే ప్రేక్షకుడు మళ్లీ మళ్లీ ఆ చిత్రాన్ని చూస్తాడు గనక...''యమగోల''కు అఖండ విజయంతథ్యము.

శ్రీ ఎన్టీ రామారావు... జయప్రద పాల్గొన్న ప్రణయ సన్నివేశాలు, ప్రేక్షకులను పరవశింప చేస్తాయి.

శ్రీ తాతినేని రామారావుకు శ్రీ ఎన్టీ రామారావుతో మొదటి చిత్రం యిదేగనక... ఆయన తమ మైత్రీ బంధాన్ని పెంచుకునే విధంగా, చిత్ర విజయానికి కృషి చేశారని చెప్పొచ్చు.

భాస్కర చిత్ర నిర్మిస్తున్న చైతన్య ప్రధానమైన ''మేలుకొలుపు'' చిత్రంలో శ్రీ ఎన్టీఆర్ శాంతి... భద్రతలను పరిరక్షించే పోలీస్ ఆఫీసర్‌గా గంభీరమైన పాత్రను పోషిస్తున్నారు.

చిత్రం ఆద్యంతం అగుపించే పాత్ర గాకపోయినా... కనిపించినప్పుడల్లా ''థ్రిల్'' కలుగచేసే పాత్ర శ్రీ ఎన్టీఆర్‌ది.

నిర్మాత శ్రీ పుండరీకాక్షయ్య ఎంపిక చేసిన అవార్డు విన్నింగ్ కథ ''మేలుకొలుపు''కు బి. వి. ప్రసాద్ దర్శకుడు.

ఈ చిత్రంలో కె. ఆర్. విజయ, జయప్రద, చలం, ప్రభాకరరెడ్డి, నాగభూషణం, పద్మనాభం ప్రధాన పాత్రధారులు.

డిశంబర్‌కల్లా చిత్రాన్ని పూర్తిచేసి, కొత్త సంవత్సర ఆరంభంలో ''మేలుకొలుపు''ను, అన్నపూర్ణా ద్వారా విడుదల చేసే వుద్దేశ్యం పుండరీకాక్షయ్యకు వుంది.

లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్‌లో శోభన్, దీప



'చరిత్రహీనులు' దీప, చంద్రమోహన్

## ఎన్టీఆర్ సొంత చిత్రాలు

చిరంజీవి బాలకృష్ణ సలీంగా, దీప అనార్కలిగా, శ్రీ ఎన్టీఆర్ అక్బరుగా, జమున జోదీభాయ్‌గా, గుమ్మడి తాన్‌సేన్‌గా రూపం దిద్దుకుంటున్న "అక్బర్ సలీం అనార్కలి" వర్ణ చిత్రాన్ని సంక్రాంతి కానుకగా విజయా పిక్చర్స్ ద్వారా విడుదల చెయ్యాలన్న తలంపు దర్శక నిర్మాత శ్రీ రామారావుకు వుంది

శ్రీరాముడుగా, రావణబ్రహ్మగా ద్విపాత్రాభినయం పోషిస్తూ, దర్శకత్వం నెరపుతున్న "శ్రీరామ పట్టాభిషేకం" చిత్రాన్ని కూడా జనవరికల్లా పూర్తిచేసి, తెలుగు సంవత్సరాదికి విడుదల చెయ్యాలన్నది, శ్రీ రామారావు సంకల్పం కాబోలు !

## సినిమా

ఏది ఎప్పుడు విడుదల చేసినా, ప్రేక్షకులు రామారావుగారి చిత్రాలను ఘనంగా ధనంగా ఆదరిస్తారు.

వైజయంతీ మూవీస్ సినిమాస్కోప్ వర్ణ చిత్రంగా నవంబర్‌లో ప్రారంభిస్తున్న "యుగపురుషుడు" చిత్రంలో శ్రీ ఎన్టీఆర్ యాక్షన్ పేక్‌డ్ పాత్రను పోషిస్తున్నారు

దర్శకుడు బాపయ్యకు తన చిత్రాలలో రామారావుగారిని ప్రత్యేక శైలిలో చూపెట్టాలని వుంది గనక ఎదురు చూడని పాత్రలో శ్రీ రామారావును ప్రభావితం చెయ్యడానికి, నిర్మాత అశ్వినీదత్ పూనుకున్నారు

శ్రీ ఎన్టీఆర్‌తో ఆడుతూ, పాడే కథానాయిక పాత్రను జయప్రద పోషిస్తున్నది

"చిలకమ్మ"గా పేరందిన శ్రీప్రియ రామారావుగారి చెల్లెలుగా నటించగలదని తెలిసింది

పాఠకులకు వచ్చేవారం శోభన్‌బాబు కృష్ణ గార్లు నటిస్తున్న చిత్రాలు వాటిలో వారు ధరిస్తున్న పాత్రల గూర్చి అందివ్వడానికి ప్రయత్నిస్తాను

## పెద్ద సంస్థల నాయిక

''జ్యోతి'' చిత్రంతో తనకు ''స్టార్ వేల్యూ''ను సంపాదించుకున్న జయసుధ యిప్పటున్న యువతరానికి యిష్టనటిగా వుండడం నిజం గాబట్టే, ఆమెను పెద్ద సంస్థలు నాయికగా ఎంపిక చేస్తున్నాయి

''స్టార్ వేల్యూ'' వున్న మూడు పెద్ద సంస్థలలో (సురేష్ ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ డి వి ఎస్) జయసుధ హీరోయిన్‌గా, వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తూంది

''మొరటోడు'' చిత్రంలోని పాత్రకు, ''అర్ధాంగి'' చిత్రంలోని పాత్రకు, డి వి ఎస్ రాజుగారి చిత్రంలోని పాత్రకు ఎంతో వైవిధ్యం వుంది అని ప్రేక్షకులు వొప్పుకుంటారు.. ఆమె ''నటన''కు పట్టం కడతారు

కష్టమని, ముగ్గురికి అంగీకరించాను'', అన్నారు, శ్రీనివాసరావు

ఫల్గుణా కంబైన్స్ (శ్రీ ఏకామ్రేశ్వరరావు, శ్రీ నాచు శేషగిరిరావు, శ్రీ కాంత్ నహతాగార్లు

సింగీతం చేసే చిత్రానికి, మినిమమ్ గ్యారంటీ వుంటుందనేది నమ్మకాన్ని, ఆయన చిత్రాలు నిరూపించాయి

విశ్వభారతివారి ''తరం మారింది'' చిత్రాన్ని చూచిన పల్వురు, సింగీతంగారి ప్రతిభను కొనియాడారు

## అశ్వినీదత్ అదృష్టం

''ఎదురులేని మనిషి'' చిత్రం, నిర్మాత అశ్వినీదత్ గారికి ఎదురుచూడని లాభాన్ని ఆర్జించి పెట్టింది



'పంతులమ్మ'లో లక్ష్మి

## ఆదిత్యకు బాపయ్య

ఆర్ట్ డైరెక్టర్ రాజేంద్రకుమార్ తలపెట్టిన రెండో వర్ణ[illegible] ఆర్ అంగీకారం తెలిపిన విషయం పాఠకులకు తెలుసు

వసూళ్ల బాపయ్య దర్శకత్వాన్ని, రాజేశ్వరరావు సంగీతాన్ని నిర్వహిస్తారన్నది పాఠకులకు కొత్త వార్త



'అర్ధాంగి'లో అల్లు, జయసుధ

## ఊటీలో లక్ష్మి

వరుసగా రెండు ''అమ్మాయి'' చిత్రాలను నిర్మించి, విజయాన్ని చవిచూచిన నిర్మాత కృష్ణంరాజుగారు (నవత) తన కొత్త చిత్రానికి ''పంతులమ్మ'' అని పేరెట్టి, సెప్టెంబరులో పక్షం రోజులు నాన్‌స్టాప్ షూటింగు జరిపారు

లక్ష్మి రంగనాథ్. దీప పాల్గొనే శృంగార యుగళగీతాలను (అయిదింటిని) ఊటీలో చిత్రీకరించేందుకై, అక్టోబర్ మొదటి రెండు వారాలను తమవిగా చేసుకున్న విజాన్ని, నిర్మాత కృష్ణంరాజు తెలిపారు

కన్నడ ప్రముఖులు రాజన్ నాగేంద్ర సంగీత దర్శకత్వంలో బాలు - సుశీల పాడిన అయిదు పాటలను విన్నప్పుడు, ప్రతి పాటలో కొంత ప్రత్యేకత ధ్వనింపడానికి, గీత రచయిత వేటూరి ప్రభ ప్రతిభ కారణం అనిపించింది ఈ చిత్రానికి సింగీతం దర్శకుడు

## సింగీతం చేసే చిత్రాలు

'పంతులమ్మ'' సెట్లో, దర్శకుడు సింగీతాన్ని కలిసి, ఆయన అంగీకరించిన కొత్త చిత్రాలను గూర్చి అడిగాను ''అడిగారు అయిదారుగురు, అందరికీ ఒకేసారి, చెయ్యడం

అంతకు మించిన అదృష్టాన్ని అశ్వినీదత్ దోచుకునేందుకు అనుకూలత ఏర్పడింది

బిజీ సూపర్‌స్టార్ రామారావుగారు, దత్ గారికి యింత త్వరగా కాల్‌షీట్లు యివ్వడమే శుభ సూచకం

''యుగపురుషుడు'' అని ఎప్పుడో నిర్ణయించిన పేరుకు అనుగుణంగా, తమిళ రచయిత బాలమురుగన్ వ్రాసిచ్చిన కధకు, ''వసూళ్ల'' బాపయ్య బిగువయిన కధనాన్ని సృష్టించుకుని, నవంబర్‌కు రెడీ అయ్యారు

ఈ కొత్తతరహా స్కోప్ వర్ణచిత్రంలో జయప్రద, శ్రీప్రియ, జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, ప్రభాకర రెడ్డి, ముఖ్య పాత్రధారులు

''యుగపురుషుడు'' వర్ణ చిత్రానికి వెంకటరత్నం, కృష్ణారావు, సంజీవి, మహదేవన్, ఆచార్య ఆత్రేయ ముఖ్య సాంకేతిక సారధులు

చిత్రంలోని ఆరు పాటలలో అయిదు యుగళ గీతాలని, అవన్నీ ఎన్టీఆర్ జయప్రదలపై చిత్రీకరిస్తారని, నిర్మాత దత్ చెప్పారు



'ప్రయాణంలో పదనిసలు'లో జయచిత్ర

# సినిమా

**రాజమండ్రి రాగలీల**

విజయమాధవీ పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న జనరంజక చిత్రానికి సంబంధించిన రెండు శృంగార గీతాలను, రాజమండ్రి పరిసర ప్రాంతాలలో చిత్రీకరించడంతో, అక్కినేని జయచిత్ర గార్ల తొలి చిత్రం పూర్తయింది

కరుణరసం, శృంగారరసం, హాస్యరసం, వీరరసంలు చిత్రంలో సమంగా వున్నాయి గనక, పాటలన్నిటికి సన్నివేశ ప్రాబల్యం వున్నది గనక, నటీనటు లందరూ అనుభవజ్ఞులు గనక, నిర్మాత శ్రీ వడ్డే శోభనాద్రికి, యీ చిత్రం ఆనందాన్ని అందించేది తథ్యము అని వూహించవచ్చు

''ఆలుమగలు'' చిత్రం తరువాత వచ్చే అక్కినేని తాతినేనిగార్ల చిత్రం విజయ. మాధవీ పిక్చర్స్‌వారిదే గనక, ప్రేక్షకులు బాగా ఎదురుచూసే వాతావరణానికి, అనుకూలత అబ్బేది తథ్యమే

**రామకృష్ణ కేం యింత గొప్పదా!**

దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' చిత్రానికిగాను, డాక్టర్ నారాయణరెడ్డిగారు ఒక అపురూపమైన విషాద గీతాన్ని వ్రాశారు

''దూరాన ఒక కేక
ఇది రాదు నీ దాకా'' అనెడి పల్లవితో ప్రారంభమై, అయిదు నిమిషాలు సాగిన భావగర్భితమైన ఆ విషాద పాటను, రామకృష్ణ అద్వితీయంగా పాడారు సంగీత దర్శకుడు రాజేశ్వరరావుగారు యిచ్చిన శిక్షణ, దర్శకుడు శ్రీ దాసరి చూపెట్టిన శ్రద్ధ ఆసక్తి ఆ పాటను విన్నవారందరూ అంగీకరించారు

శ్రీనివాసులు పాండురంగప్ప నిర్మిస్తున్న ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' వర్ణచిత్రంలో వాణిశ్రీ, జయప్రద, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, సావిత్రి, ''షావుకారు' జానకి, మోహన్‌బాబు ముఖ్య పాత్రధారులు

**బాలు రామకృష్ణ**
**పోటీపడిన పాట**

వృత్తిలో పోటీ వున్నప్పుడే, ఆ విద్యకు రాణింపు వస్తుంది అలాంటి సంఘటన యిటీవల ఒకటి జరిగింది

ప్రజాదర్శకుడు శ్రీ దాసరి సృష్టిస్తున్న ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' వర్ణచిత్రానికిగాను డాక్టర్ నారాయణరెడ్డి ఒక మాణిక్యాన్ని రూపొందించారు

''అజంతా . అమరావతి
హళీబీడు కోణార్క
రామప్ప లేపాక్షి
రమ్య శిల్ప చిత్ర రూపధారిణీ మనోహారిణీ'

అనెడి పల్లవితో ప్రారంభమై, ఆరు నిమిషాలు సాగిన మనోహర గీతికను, బాలసుబ్రమణ్యం రామకృష్ణ పోటీపడి గానం చేశారు ''సంగీత సామ్రాట్'' శ్రీ రాజేశ్వరరావు ఆ మధుర గీతానికి, మనోజ్ఞ సంగీతాన్ని సమకూర్చారు

ఈ నృత్య నాటికను అక్కినేని జయప్రద మోహన్‌బాబుగార్లపై చిత్రీకరింపబోతున్నట్లు, అగ్రదర్శకుడు చెప్పారు

శరత్ ''దేవదాసు''తో దీన్ని పోల్చవద్దని, తను శక్తిమేరకు యీ చిత్రాన్ని జనరంజకం చెయ్యగలనని, దర్శక కథకుడు శ్రీ దాసరి చెప్పారు

'విజయమాధవీ పిక్చర్స్' చిత్రంలో
అక్కినేని, సత్యనారాయణ



## విజయవాడలో విజయనిర్మలతో యింటర్వ్యూ

నటిగా ఒక చిత్రంలో నటించినప్పటికంటే ఎక్కువ స్వేచ్ఛ వుంటుందని దర్శకత్వం చేపట్టానని ప్రముఖ నటి, దర్శకురాలు శ్రీమతి విజయనిర్మల నాతో చెప్పారు ఒక ఇంటర్వ్యూలో



ఒక కథ ఎంచుకొని, చిత్రం నిర్మించుదామని అనుకుంటుండగా, అదే ఇతివృత్తాన్ని మరొకరు ఎంచుకున్నారని తెలిసి ఆ కథను వదులుకొని ''పంచాయతి'' కథను ఎంచుకోవడం జరిగిందని ఆమె ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు

దర్శకురాలుగా చిక్కులేమయినా ఎదుర్కొంటున్నారా అన్న ప్రశ్నకు సమాధానంగా తమ సంస్థకు శాశ్వత పద్ధతిలో పనిచేసే సాంకేతిక నిపుణులున్నారు కాబట్టి వారివల్ల చిక్కులేమీ రావడంలేదని, కళాకారుల వల్లనే అప్పుడప్పుడు అందరు నిర్మాతలు, దర్శకులవలెనే తమకుకూడా చిక్కులు రావటం కద్దని ఆమె చెప్పారు

ఏ రకం పాత్ర అయినా తనకు ఇష్టమేనని, అయితే సెంటిమెంటల్ పాత్రలు, కొంచెం హెవీ నటన అవసరమయ్యే పాత్రలంటే ఇష్టం కావని ఒక ప్రశ్నకు ఆమె సమాధానమిచ్చారు

తీరిక వేళలలో ఆమె తెలుగు నవలలు బాగా చదువుతారు తోట పని, వంట ఆమె హాబీలు గుర్తుంచుకోదగ్గినంతటి మంచి నవల యింత వరకు ఆమె చదవలేదు ఒక కథలో కలిసిపోయే మేరకు మాత్రమే హాస్యం వుండాలిగాని, హాస్యం కోసం ప్రత్యేక పాత్రలను సృష్టించడం అనుచితమని ఆమె అభిప్రాయం ''రంగుల రాట్నం'' ఆమె నటించిన మొదటి తెలుగు చిత్రం 'కవిత' మళయాళ చిత్రానికి ఆమె మొదట దర్శకత్వం నెరపారు వినోదంతోపాటు, విజ్ఞానం కూడా లక్ష్యంగా వుంటే ఆ చిత్రం బాగుంటుందని ఆమె అభిప్రాయం ఒక కథలో సెంటిమెంట్ వున్నదా యేంటి సెంటిమెంట్ వున్నదా ? అన్నది ప్రశ్న కాదు ఇతివృత్తాన్ని ఎలా తీర్చిదిద్దారనేదే ముఖ్యమని శ్రీమతి విజయనిర్మల చెప్పారు ఒక చిత్రంలో సిట్యుయేషన్‌నుబట్టి మాత్రమే పాటను ప్రవేశపెట్టాలని ఆమె అన్నారు.

తమ చిత్రాలలోకి కొత్త నటీనటులను తీసుకొనే ఉద్దేశం వున్నదిగాని యింతవరకు కుదరలేదని శ్రీమతి విజయనిర్మల చెప్పారు

— వి ఎస్ అవధాని

# టూకీగా టాకీ న్యూస్

★ రామకృష్ణా ఆర్ట్సు నిర్మించిన "గడుసు పిల్లోడు" వర్ణ చిత్రం అక్టోబర్ 27 న తారకరామ ద్వారా విడుదల అవుతుంది

శోభన్‌బాబు రెండు పాత్రలను పోషించిన ఈ మాస్ చిత్రంలో జమున, మంజుల నాయిక పాత్రలను ధరించారు

శ్రీ బాపయ్య దర్శకత్వంలో రూపొందిన యీ చిత్రంలో రాజబాబు నాగేష్ అల్లు రామలింగయ్య . రమాప్రభ నవ్వుల వర్షాన్ని కురిపించారు

శ్రీ రామకృష్ణారెడ్డి నిర్మించిన "గడుసు పిల్లోడు" అన్ని వర్గాల ప్రేక్షకులను ఆకట్టుకో గలదని ఊహించవచ్చు

★ హీరో కృష్ణ నటించిన "ఇంద్రధనుస్సు, మనుషులు చేసిన దొంగలు, పట్నవాసం" చిత్రాలు బాక్సాఫీస్ వద్ద ఘన విజయాన్ని సాధించగలవని, ఆ చిత్రాల రషస్‌ను చూచిన వ్యక్తులు అభిప్రాయ పడుతున్నారు

వెరైటీ కథలను ఎంపిక చేస్తున్న కృష్ణగారికి, ప్రేక్షకులు ప్రత్యేక ఆదరణ చూపడానికి సంశయించరు

హీరో కృష్ణకు ప్రజల్లో ప్రత్యేకమైన ఫాలోయింగ్ వుంది గాబట్టే, ఆయనగారి సెకండ్‌రన్ చిత్రాలు ఘనంగా ధనాన్ని ఆర్జించి పెడుతున్నాయి

— శ్రీనివాస్



'మొరటోడు' లో
రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య

# పదో అంతస్తు మీదనుంచి
# పడ్డ సునందిని దుర్మరణం

సినీ నటి సునందిని మరణవార్త మద్రాసు సినిమారంగంలో సంచలనం కలిగించిందీవేళ. కెమెరా ముందు భావోద్వేగాలను ప్రదర్శించే నటీమణులు నిజ జీవితంలో సహనం వహించకపోతే యెంతటి దుష్పరిణామాలకు దారితీస్తుందనడానికి ఈ సంఘటన మరో దృష్టాంతం. సినిమాతారల జీవితం పూలపాన్పు వంటిది కాదనడానికి మరో ఉదాహరణ. సంధ్యాలోని 'టవర్ బ్లాక్' లోని 10వ అంతస్తులో సునందిని తన తల్లి సీతమ్మ, తండ్రి కృష్ణమూర్తి, తమ్ముళ్ళు రంగప్ప (18), రాజేష్ (14), మధు (7), చెల్లెలు దుర్గ (5)లతో నివసిస్తుండేది అద్దె 300 రూ లు. ఆ 10వ అంతస్తు నించి (120 అ ఎత్తునించి) కింద పడడంతో అక్కడికక్కడే అసువులు బాసింది. నెత్తురు మడుగులో ఆమె ముఖం గుర్తుపట్టడానికి వీల్లేనంతగా చితికిపోయింది. సెప్టెంబర్ 29న యీ దుర్ఘటన జరిగింది.

ఈమెకు ముగ్గురు మేనత్తలు. ఒక మేనత్త నటీమణి జి వరలక్ష్మి "సునందిని యింతటి అఘాయిత్యానికి పూనుకుందన్న పిడుగులాంటి వార్త తెలిసి దిగ్భ్రమచెందాను. ఏదైనా ప్రేమ వ్యవహారం లాంటిది యిందుకు కారణమా అనుకోడానికీ వీల్లేదు. అటువంటిదేదైనా వుంటే నా చెవికి సోకకుండా వుండేది కాదు. ఐతే ఆ అమ్మాయి ముక్కోపి" అన్నారు. మరో మేనత్త సుందరమ్మ కూతురు నటి రత్న యిలా అంది "ఇరవై రోజులకు ముందు మా అమ్మను పోగొట్టుకున్నాను. ఇప్పుడు సునందిని నాకు దూరమైంది. ఆ క్రితంరోజు రాత్రి సినిమాకు వెళ్దామని అంది. ఈగా థియేటర్‌లో 'అమర్ అక్బర్ ఆంథోనీ' సినిమాకు తీసుకెళ్ళి, రాత్రి 1 గం 30 ని ప్రాంతంలో నా కారులోనే ఆమె యింటి దగ్గర డ్రాప్ చేశాను. మర్నాటి ఉదయం ఈ దుర్వార్త తెలిసి నిశ్చేష్టురాలనయ్యాను" ఆమె తల్లి ఇలా అంది "రాత్రి అంత ఆలస్యంగా యింటికి చేరుకున్నందుకు ఈడొచ్చిన పిల్లకు ఇది తగదని మృదువుగానే మందలించాను. మర్నాటి ఉదయం 7 గంటలకు అమ్మాయి నిద్రలేచినప్పుడు కాఫీ కప్పు యిస్తూ కూడా అదే మాటన్నాను. ఇంతలో ఏదో పనిమీద నేను వంట గదిలోకి వెళ్ళేసరికి యీ ఘోరం జరిగిపోయింది" మరో మేనత్త కూతురు ఫటాఫట్ జయలక్ష్మి: "సునందిని నాకన్నా 6 నెలలు పెద్ద. నటిగా పైకొస్తూన్న తరుణంలో ఆమెకు నూరేళ్ళూ నిండడం ఎన్నెంతో కలచివేసింది"

సునందిని వయసు 22. అసలు పేరు రాజలక్ష్మి. "మన్మథలీల" చిత్రంలో కమలహాసన్‌ను ప్రేమించి పిచ్చెక్కిన యువతిలా నటించేటప్పుడు ఆమె పేరును సునందినిగా డైరెక్టర్ కె బాలచందర్ మార్చారు. ఈమె మోడల్‌గా కూడా కొన్ని ప్రకటనలకు పోజిచ్చింది. కొన్ని తెలుగు చిత్రాలలో కూడా చక్కగా నటించి మంచి పేరు తెచ్చుకుంది.



...మ్మ పోయిన భవిష్యత్తు

## జి.వి.జి. పేజీ

### పాతాళగంగ

పేరుమోసిన స్మగ్లర్ హాజీమస్తాన్‌మిర్జా సెప్టెంబర్ 17న తన జన్మదినోత్సవంనాడు కొత్త సినిమా హీరో అయ్యాడు. అక్రమ రవాణాలను అరికట్టేందుకు శ్రీ జయప్రకాష్ నారాయణ్‌గారికి మస్తాన్ యిచ్చిన వాగ్దానంలో యిదొక పర్వ. దేశ విదేశాలలో స్మగ్లర్ల కార్యకలాపాలను తెలియజేస్తుంది చిత్రం. మస్తాన్ పుట్టి, బాల్యంలో పెరిగిన హాజీసిద్దిక్‌స్థలం నద్దే షూటింగ్ ప్రారంభమైంది. దిలీప్‌కుమార్, సునీల్‌దత్‌లు శుభాకాంక్షలు అందజేయడానికి విచ్చేశారు. ఈ చిత్రానికి అలనాటి నటి నిమ్మి నిర్మాత. ఆమె భర్త అలీరజా రచయిత, దర్శకుడు. సినిమాస్కోప్‌లో తయారయ్యే యీ చిత్రం పేరు "పాతాళగంగ."

### ఆమె కథ

"మా చిత్రం పేరును 'ఆమె కథ'గా మార్చాం" అన్నారు నిర్మాత క్రాంతికుమార్. కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్ నిర్మించే యీ చిత్రానికి ఆమధ్య హైదరాబాద్‌లో రెండు పాటలను మురళీమోహన్, ప్రభ, శ్రీప్రియలపై చిత్రీకరించడంతో పాచ్ వర్క్ మినహా షూటింగ్ అంతా దాదాపు పూర్తయినట్లే. ఇంకా జయసుధ, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రమాప్రభ ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. రచన సత్యానంద్. సంగీతం: చక్రవర్తి. ఛాయ కె. ఎస్. ప్రకాష్. కూర్పు: అంకిరెడ్డి. శిల్పం తోట వేమచందర్.

### రెండు కొత్త చిత్రాలు

సెప్టెంబర్ 29 ఉదయం రెండు చిత్రాలకు ప్రారంభోత్సవాలు జరిగాయి.

కవిత ఆర్ట్ ప్రొడక్షన్స్ పతాకం కింద డి. వి. ఎస్. రాజు నిర్మించే వర్ణ చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, సత్యనారాయణ, అల్లురామలింగయ్య ప్రధాన పాత్రధారులు. మాటలు: సముద్రాల. గీతాలు: సి. నారాయణరెడ్డి. సంగీతం: మహదేవన్. ఛాయ: జి. కె. రాము. శిల్పం: కళాధర్.

కె. ఎస్. రెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. ప్రకాష్ నిర్మించే సురేఖా ఆర్ట్ పిక్చర్స్ "తుఫాన్ మెయిల్" వర్ణ చిత్రంలో మంజుల, విజయలలిత, నరసింహరాజు, గిరిబాబు, శరత్‌బాబు, కె. వి. చలం, సత్యేంద్రకుమార్, కె. హరిబాబు నటవర్గం. మాటలు: కృష్ణమోహన్. ఛాయ: పి. దేవరాజ్. సంగీతం: సత్యం. శిల్పం: బి. ఎన్. కృష్ణ. కూర్పు: కందస్వామి. అసోసియేట్ డైరెక్టర్: ఎస్. పి. రంగారావు.

### చిలిపికృష్ణుడు

"డిసెంబర్ మొదటివారంలో మా 'చిలిపి కృష్ణుడు' షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు సురేష్ ప్రొడక్షన్స్ అధినేత డి. రామానాయుడు. బోయిన సుబ్బారావు దర్శకత్వంలో అన్నపూర్ణ స్టూడియోలో తయారౌతున్న ఈ వర్ణ చిత్రంలో ఎ. ఎన్. ఆర్., వాణిశ్రీ, జయలక్ష్మి, శుభ, నూతన నటి మోహిని, శాంతకుమారి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, రాజ్‌బాబు, సత్యేంద్రకుమార్, కె. కె. శర్మ, సి. హెచ్. కృష్ణమూర్తి, గౌరవ పాత్రధారులుగా గుమ్మడి, రావుగోపాలరావు, నాగేష్ పాల్గొంటున్నారు. రచన: ఆత్రేయ. సంగీతం: మహదేవన్. ఛాయ: ఎ. వెంకట్. శిల్పం: జి. వి. సుబ్బారావు. కూర్పు: మార్తాండ్. నృత్యాలు: హీరాలాల్.

### కృష్ణ ద్విపాత్రాభినయం

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు దర్శకత్వంలో వడ్డె శోభనాద్రి నిర్మించే "కటకటాల రుద్రయ్య" వర్ణ చిత్రంలో కృష్ణ ద్విపాత్రాభినయం ప్రధాన ఆకర్షణ.

### ముగ్గురు మూర్ఖురాళ్ళు

"గంగ – యమున – సరస్వతి" విడుదల అనంతరం రచయిత, దర్శక నిర్మాత మహేష్ డిసెంబర్ 20 నించి షూటింగ్ ప్రారంభించే లావణ్య పిక్చర్స్ హాస్యరసప్రధాన చిత్రం "ముగ్గురు మూర్ఖురాళ్ళు"లో జయసుధ, రమాప్రభ, మనోరమ, సత్యనారాయణ, మురళీమోహన్, జానకి, సూర్యకాంతం వగైరా తారాగణం. ఒక కొత్త యువతిని తమ చిత్రంలో హాస్య నటిగా పరిచయం చేయదలిచామని నిర్మాత మహేష్ తెలియజేశారు. ★








ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అర్ధాంగి






నిర్మాత: ఎ.వి.సుబ్బారావు దర్శకత్వం: ఎ.మోహనగాంధి సంగీతం: టి.చలపతిరావు నవయుగ

NVKR

## రాగబంధం

[2[illegible] వ పేజీ తరువాయి]

విజయ సన్నజాజులు కనకాంబరాలు కలిపి మాలకట్టి తను కొంచెం పెట్టుకుని మిగతావి సజ్జలో పెట్టుకుని సుందరి గదిలోకి వచ్చింది

''నీకని పువ్వులు తెచ్చానక్కా!'' అంది విజయ నెమ్మదిగా!

''తెస్తే అక్కడపెట్టి వెళ్లు!''

''అడక్కపోయినంత మాత్రాన కోసుకు రాకూడదని యెక్కడున్నది? తొందరపడి యితరులను తూలనాడకూడదు సుందరీ?'' మందలించింది పార్వతమ్మ

''ఇప్పుడు నేనేమన్నానని అలా అంటారు? పువ్వులు పెట్టుకునేదాన్ని వున్నానుకదా అనన్నాను! మేనకోడలంటే మీకున్న ప్రేమలోనూ రవవంతు అయినా నామీద వుంటే నేనెంతో సంతోషించే దాన్ని!''

''అంతలా యెందుకు అపార్థం చేసుకుంటావమ్మా! మీ యిద్దరూ నాకు రెండు కళ్లవంటి వారమ్మా! ఎవరి మనసూ బాధపడకూడదనే నా ఉద్దేశ్యం! విజయ చిన్నపిల్ల! ఈ వాతావరణానికి ఇంకా అలవాటుపడలేదు. నేను చెప్పటంలో తప్పు లేదుగా?''

''చెప్పకోండి! ఇప్పుడెవరు వద్దన్నారు? నెత్తిమీద పెట్టుకుని పూజించుకోండి! ఎవరికి కావాలి? అయిన వాళ్లకి ఆకుల్లోను; కాని వాళ్లకి కంచాలలోనూ! అన్న సామెత బాగానే రుజువు చేసుకుంటున్నారు!''

సుందరి విసురుగా తిరిగి మెట్లు ఎక్కసాగింది ఆఫీసు నుంచి ఉప్పుడే వచ్చిన భాస్కర్ తల్లి ప్రూన్పడి నిలబడిపోయి వుండటం, భార్య విసురుగా మెట్లు యెక్కటం చూసి బాధపడ్డాడు తొందర స్వభావం గల తన భార్య ఏదో అన్నదని గ్రహించాడు ఆడవాగి మాటల్లో జోక్యం చేసుకోవటం భాస్కర్‌కి యిష్టం వుండదు భర్త రావటం చూసి మరింత తొందరగా మేడమీద గదిలోకి వెళ్లిపోయింది

ఈ సమయంలో తను గదిలోకి వెళ్తే సుందరి చేసే ఆర్భాటం ఇంతా అంతా కాదు! ఆ కోపం తగ్గేవరకూ తను కనిపించకుండా వుండటం మంచిదనుకొని తిన్నగా డైనింగ్ రూంలోకి వెళ్లిపోయాడు ఎంతకీ గదిలోకి రాని భర్తమీద కోపం వచ్చింది సుందరికి



నానీడె నాతోడు —పొటో : పి. దివాకరరావు

కటువుగా వచ్చిన ఆ జవాబుకి నివ్వెరపోయింది విజయ సజ్జతోనే డ్రాయర్‌మీద వుంచి క్రిందకి వస్తుండగా మెట్లమీదనే భాస్కర్ ఎదురయ్యాడు

''ఏమ్మా విజయా! బాగా చదువుతున్నావా?'' అనడిగాడు

''ఆం బాగానే చదువుతున్నాను పెదబావా!''

''ఏమిటి విశేషం? మీ అక్క గదిలో నుంచి వస్తున్నావు?''

''మీ కిష్టమని సన్నజాజులు కనకాంబరాలు కలిపి మాల కట్టి అక్కకి ఇచ్చి వస్తున్నాను!''

''అమ్మ కొంటెపిల్లా? నాకిష్టమయితే నాకివ్వకుండా మీ అక్కకి ఎందుకు ఇచ్చినట్టో?''

''మీకు జడ లేదుగా?''

నవ్వుకుంటూ క్రిందకి వచ్చేసింది విజయ

''అమ్మా విజయా!''

లోపలికి వస్తూనే రామనాథం పిలిచాడు

''ఇదిగో! వచ్చేశాను మామయ్యా!'' మంచినీళ్ల గ్లాసుతో అక్కడికి వచ్చింది విజయ

రామనాథం రోజూ ఇంటికి రాగానే ముందుగా విజయను పిలవటం అలవాటయిపోయింది ఆ పిలుపు వినటంతోనే చల్లని మంచినీళ్ల గ్లాసు నిండా యివ్వటం విజయకి అలవాటయిపోయింది ఆ తరువాత గానీ పార్వతమ్మ తెచ్చి యిచ్చిన టీ కప్పు అందుకోడు రామనాథం మంచి నీళ్లు విజయే తీసుకురావాలి! విజయ అంటే రామనాథంకి యెంతో ప్రేమ! ఆమె నడవడిక ఎంతగానో ఆకర్షించటం, ఎవరి దగ్గిర యెలా మాట్లాడవలసిందీ? మాట్లాడే తీరులో గూడా యెంతో మెలుకువతో వ్యవహరించుతుంది విజయను చూస్తుంటే జానకి గుర్తువస్తుంది జానకి గుర్తు రాగానే గతం గుర్తుకు వస్తుంది. ''ఇదంతా జానకి చల్లని చూపువల్లనే!'' అనే కృతజ్ఞతాభావం ఏర్పడుతుంది.

శ్రీనివాస్ కాలేజీకి వెళ్లటం, రావటం కూడా రామనాథానికి తెలియదు కాలేజీ ఫీజుకని, పుస్తకాలకని డబ్బు తీసుకోవటంవరకే తెలుస్తున్నది ఇటీవల! తన అడుపాజ్ఞల నుంచి చిన్నకొడుకు ఏనాడో జారిపోయాడని రామనాథానికి తెలుసు.

శ్రీనివాస్ మనస్తత్వం ''ఇలాంటిది'' అని అర్థం చేసుకున్న తరువాత నయానకంటే భయాన మాత్రమే శ్రీనివాస్‌ని మార్చగలననుకున్నాడు కన్నతండ్రిగా బాధ్యత అప్పుడప్పుడు గుర్తు చేసుకుంటూ!

[ఇంకా వుంది]

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.



నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు






2 ప్యాక్‌లలో
దొరుకును —
"బ్లూ" మరియు
"శాండల్ వుడ్"

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

* అనుమతింపబడిన రీటైల్ ధర: స్థానిక పన్నులు అదనం.

చెమటకాయల పౌడర్
మాత్రమే మీకు దురదలు, మంటల చికాకుల నుండి అతి శీఘ్రంగా ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

GN.71429J/Tel

# హార్లిక్స్

Horlicks
THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకురుతుంది ఆరోగ్యం మహాభాగ్యం

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్‌లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే. మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు అవి సులువుగా జీర్ణం అవుతాయి
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

## వారఫలం

మహేష్

**28-10-1977 శుక్రవారం మొదలు**
**3-11-1977 గురువారం వరకు**

**మేషం:—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం: —** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మిథునం:—** వ్యతిరేకమైన వార్తలను వింటారు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

**కర్కాటకం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం:—** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహిత్య కళారంగాలో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**కన్య:—** అనుకూలమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రావలసినడబ్బు అందుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. సాహసి వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**మకరం:—** విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

---

గలడు. ఆ ఒక్క మాటా చాలదూ అభిమానమున్నవాడికి ?

ఆయనకంత అధికారం ఎక్కడిది ? తను యిన్నాళ్ళూ పోరంబోకులా తిరిగాడూ? తిరిగితే మాత్రం ? తను పున్న వూళ్ళో తిరిగాడు—తన తండ్రి సొమ్ముతో తిరిగాడు. ఎవరినీ దేబిరించుకు తిరగలేదే !

'నేను చేతకానివాణ్ణి ! నా కొడుక్కి నువ్వు బుద్ధి చెప్పు'మని తండ్రి అడగబట్టేగా ఆయనలా అధికారం చలాయించబోయిందీ ? ఆయన తప్పేముంది ?

అయినా, ఆయనకింకా తన సంగతి తెలీదు. ముందు ముందు తెలుస్తుంది — తనెలాటి కొరకరాని కొయ్యో అయిందీ! కాని ఇప్పుడేంచేయాలి తను ?

### జీవనపోరాటంలో...

(18 వ పేజీ తరువాయి)

వాళ్ళ 'రాజా'ని వెంట బెట్టుకుని మంచి బాలుడిలా కాలేజీకి వెళ్ళాలా? ఛ... ఛ... తనకన్నా చిన్నవాడు— వాడు తనకి తోడేమిటి? ఆయనన్నట్టు— తనేం నోరులేనివాడా? ఒక్కడే వెళ్ళగలడు!'

ఈ నిర్ణయానికి రాగానే క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా లేచి, సూట్ కేస్ లోంచి బ్రష్, పేస్టుతో పాటూ టవల్ కూడా తీసుకుని బాత్ రూం వైపునడిచాడు, అప్పటికింకా మిగతా వాళ్ళెవరూ లేవలేదు.

భాను స్నానంచేసి బయటికి రావటంతోనే హాల్లో కూర్చున్న కౌసల్య కనబడింది!

"ఏరా భానూ— అప్పుడే లేచేశావే! పెందరాళే లేవటం అలవాటా?" అంది పలకరింపుగా,

"లేదత్తా ! ఈవాళెందుకో మెళుకువ వొచ్చేసిందంతే!"

"ఊఁహూఁ... అరె, స్నానం గూడా చేసేశావా? వేణ్ణీళ్ళు చేశావా, చన్నీళ్ళేనా"

"చన్నీళ్ళే !

"అదేం?"

"ఏమో! చేసేసానంతే !"

"అసలే చలిగా వుంది. అయినా నన్నూ లేపకపోయావూ?"

"ఎందుకూ అనవసరంగా!"

"బావుంది. వుండు— కాఫీ కలుపుకు వస్తా!" అంటూ లేచిందామె.

# జీవనపోరాటంలో...

ఆవిడ కాఫీ కలుపుకు వచ్చేసరికి, భాను డ్రెస్ అవుతూ కనిపించాడు.

"అదేం? అప్పుడే బట్టలేసు కుంటు న్నావు?" అంది ఆశ్చర్యంగా.

"ఎనిమిదింటికి కాలేజీ తెరుస్తారుటగా! లైటైపోతుందనీ..."

"అవునుకదూ! నిజమే. రాజుని లేపుతా నుండు, వాడికి ఏడు దాటితేగానీ లేచే అల వాటు లేదు." అంటూ కదలబోయింది.

"అక్కర్లేదత్తా! అతణ్ణి కూడా ఎందుకు డిస్టర్బ్ చెయ్యటం?" అన్నాడు భాను సీరియస్‌గా.

భానుకి దగ్గరగా నడిచి, అతని భుజం మ్మీద చెయ్యి వేసింది కౌసల్య.

"చూడు భానూ, రాత్రి మీ మామయ్య అన్న మాటలకి బాధపడుతున్నావ్ కదూ యింకా!" అనునయంగా అంది.

"ఏం లేదు. అయినా ఆయనేం తప్పు మాట అన్నారని నేను బాధపడాలి?"

"అదంతా నాకు తెల్సులే! అయి నా మామయ్య మీ నాన్నలా మెత్తని మనిషి కారు. కాస్త కోపం ఎక్కువ. పిల్లలు చెప్పి నట్టు వినకపోతే చాలాకోపం వస్తుందా యనకి!"

"ఆయన కోపాన్ని ఆయన పిల్లలమీద చూపించుకోమను. పరాయివాళ్లని అంటే పడేటంత తెలివితక్కువగా ఎవ్వరూ వుండరు!" దురుసుగా అన్న భాను మాటలకి కౌసల్యకి కాస్త కోపం వచ్చినా తమాయించుకుంది.

"పరాయివాళ్లని అనవల్సిన అవసరం ఎవ్వరికీ వుండదు భానూ! అయినవాడివి గనకే అన్నారు. యివాళ బాధ్యతగా మెలిగి తేనే, రేపు పైకి రావటానికి వీలవుతుంది. చిన్నతనాన చెప్పేవాళ్లు లేక చెడిపోయిన వాళ్లే, భవిష్యత్తులో ఏ దారీ దొరక్క విలవిల్లాడుతారు!

"మీ మామయ్యకీ, మీ నాన్నకీ ఏమీ తేడా చూపించకూడదు నువ్వు. వాళ్లు ఏం చెప్పినా నీ మంచికే చెప్తారని గుర్తుంచు కుంటే నువ్విలా బాధపడవు."

"నేనొట్టి వెధవనీ, పనికిరానివాడినీ అని నాన్న చెప్పేరే అనుకో! అంతమాత్రాన, రావటంతోనే అలా మాట్లాడాలా? మర్యాద కోసమైనా కాస్తంత మంచిగా మాట్లాడ కూడదా?"

భాను మాటలతో మౌనంగా వుండి పోయింది కౌసల్య. రాత్రి భర్త మాటల తీరు ఆమెకి బాధ కలిగించింది.

ఎలాటి వాడవనీ, వాడింకా కుర్రతనం వదలనివాడు. కానీ, భర్త ధోరణి ఆమెకు తెలుసు. ఆయన క్రమశిక్షణకి ప్రాణం పెడతారు. అది లేనివాళ్లని కఠినంగానే చూస్తారు. యింట్లో అయినా, ఆఫీసులో నైనా అదే మతం!

పైగా తనకి తోచిందే తప్ప మరొకళ్ళు చెప్పింది, భార్య అయినాసరే, వినే అలవాటు లేదు.

అందుకే తనూ బాధపడ్డా, బయటికి మరేమీ అనలేక వూరుకొందామె ఆ రాత్రి.

"కాఫీ చల్లారిపోతోంది తీసుకో భానూ." అంది చివరికి. కప్పు తీసుకుని గట గటా తాగేసి, సాసర్లో పెట్టేశాడు భాను. ఆ వెనక, కుర్చీలో కూర్చుని బూటు లేసులు బిగించుకోసాగాడు. అక్కణ్ణుంచి కదల బోయింది కౌసల్య.

"రాజుని మాత్రం లేపబోకు అత్తా! నే నొక్కడినేవెళ్లి చేరాలనుకుంటున్నా — అంతే!" ఖండితంగా అన్నాడు భాను.

అతడి మొండి ధోరణికి చికాకు, కోపం రెండూ కలిగినా మరేమీ అన్లేక అలాగే ఆగిపోయిందామె.

"ఏం ఫర్లేదు. రిక్షావాళ్ళకి దారీ కొత్త కాదు—రాజుకి కాలేజీ వాతావరణమూ పాతది




సార్... మీరిప్పుడు చేసిన మిమిక్రీ పులి అరుపని నేనూ, కాదు సింహగర్జన అని నా స్నేహితుడూ వాదించుకుంటున్నాం! ఎవరిది కరక్టో చెప్తారా!!

ఇద్దరిదీ తప్పే... నేను చేసింది పసిపాప ఏడుపయ్యా!!

కాదు. అంచేత అడ్డమయిన తిరుగుళ్ళూ తిరిగే నాకు యివన్నీ ఓ లెక్క కాదు.'' అంటూ మాట్లాడుతూనే సూట్ కేస్ లోంచి కావల్సిన సర్టిఫికెట్లూ, డబ్బూ తీసుకుని, వెళ్తున్నా. మామయ్య లేచి అడిగితే చెప్పు'' అనేసి బయటకు నడిచాడు!

ఓ నిట్టూర్పు విడిచి, గేటుదాకా అతడి వెనకే వెళ్ళి, ఆ తర్వాత లోపలికి వచ్చేసింది కౌసల్య.

(ఇంకా ఉంది)

సీరియల్

# శాంతి తీరం

చక్రాలం. విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

చేయిజారి అఖాతంలోకి పడిపోయిందనుకున్న ఈ రత్నం, అరచేతిలో అలవోకగా అందాలొలుకుతూ చిన్న గాలి తెరకు దుమ్ములో పడిపోయిందనుకున్న ఈ కలువ, కనువిందుగా కమ్మని నవ్వులొలకబోస్తూ అనుకోకుండా మబ్బుతెరల మాటుకు చేరిపోయిందనుకున్న ఈ చందమామ మళ్ళీ.. మళ్ళీ తన కళ్ళముందు, తన కౌగిటిలో, తన హృదయం మీద ... !!! నరేన్ కళ్ళు ఆనందంతో అరమోడ్పులయ్యాయి.

ఉన్నట్టుండి నవ్వు ఆపేసింది మాధవి. ఆమె ముఖం వెలవెల బోయింది. అనుమానంగా చూస్తూ, "మరి ... మరి, నరేన్, అన్నయ్యతో 'నా భార్య రాదు' అని చెప్పారట ? !" అంది.

నరేన్ తమాషాగా నవ్వుతూ "ఇలారా" అంటూ ఆమెను మంచం దగ్గరకు నడిపించుకు వెళ్ళాడు. ఇద్దరూ కూర్చున్నారు

"అందరూ నీవు చనిపోయావని అనుకున్నా నేనలా అనుకోలేక పోయాను. నిజంగానే నీవు బాహ్యంగా చనిపోయావని అనుకున్నా నా హృదయంలో నీవు ఎప్పుడూ అమరంగానే వున్నావు. శారీరకంగా నీవు నా చెంత లేకపోవచ్చుగానీ మానసికంగా సదా నా వెంటే వున్నావు. లేకపోతే నేనైనా ఇన్నాళ్ళు బ్రతికి వుండటం అసాధ్యమే అయ్యేది నీవున్నావనే భావనే నా జీవితమనే ప్రమిదకు చమురుపోస్తూ వచ్చింది. అందువల్లే ఎవరికీ 'నా భార్య మరణించింది' అని చెప్పలేక పోయేవాడిని. ఆ కారణంవల్లే డాక్టర్ శ్రీనాధ్ "మీ భార్యనుకూడా తీసుకురండి" అన్నప్పుడంతా "నా భార్య రా"దని మాత్రం చెప్పేవాడిని. మందార మకరందాన్ని గ్రోలిన మధుపం గడ్డిపూలమీద వాలుతుందా? నిన్ను భార్యగా ఆనందపు చరమసీమలు చూసిన నేను ఆ స్థానంలో మరెవర్నో తెచ్చిపెడ్తానని ఎలా అనుకున్నావు, నీవు లేకపోయినా ?"

"నరేన్ !!!"

"ప్రేమ తన ప్రభావాన్ని స్త్రీ పురుషులిద్దరిమీదా సమానంగానే చూపుతుంది నేను లేనన్న భ్రమలో సర్వాన్నీ త్యజించి అన్నింటికీ, అందరికీ దూరంగా నీవిలా విరాగిణిలా బ్రతకగా లేనిది నేను మాత్రం నీవు లేవు అనుకున్నంత మాత్రాన..." బాధగా ధ్వనించింది నరేన్ గొంతు.

"నరేన్" తను తప్పు చేసినట్లుగా అతన్ని వారించింది మాధవి.

అలసటతోనూ, ఆనందంతోనూ నరేన్ మంచంమీద అడ్డంగా వాలిపోయాడు. మాధవి అతని గుండెలమీద పూలగుత్తిలా సోలిపోయింది.

కొద్దిసేపు మరేగాలీ సోకకుండా 'ప్రేమ పారవశ్యం' వారిద్దరిచుట్టూ గూడు కట్టింది పువ్వుల బంధంలో చిక్కుకుపోయిన గువ్వ జంటలా ఒదిగి ఒదిగి పోయారు.

ముందుగా తేరుకున్న మాధవి ప్రశ్నించింది "మీరు .. మీరు... ఆరో ..." ఆమెకు పూర్తి చేసేందుక్కూడా నోరాడటం లేదు ఆ భయంకర స్వప్నాన్ని గుర్తు చేసుకునేందుక్కూడా ఆమె మనసు మొరాయిస్తోంది స్వర్గంలో కాలు పెడ్తున్న క్షణాన నరకం గురించి గుర్తు చేసుకోవడాన్ని ఎవరు మాత్రం ఇష్టపడ్తారు ?

నవ్వాడు నరేన్.

"అందుకే ఎంతటి మనస్తాప పరిస్థితిలోనైనా తొందర పడకుండా నిజాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నించాలని పెద్దలంటారు.

పెళ్ళికి వెళ్ళేందుకు ముందురోజు నలుగురం వెళ్తున్నామని నీకు చెప్పాను. అలాగే నలుగురమే బయల్దేరాము కానీ ఇంకా సిటీ దాటకుండానే ఒక ఫ్రెండ్ కనిపించాడు వాడూ పెళ్ళికే వాడికి బస్ అందలేదట. మా జీప్ చూడగానే సంతోషంగా వచ్చి ఎక్కాడు పూర్ ఫెలో. అప్పుడు జీపులో వున్నది డ్రైవర్‌తోసహా మొత్తం ఆరుగురం హైదరాబాదు దాటి మూడు కిలోమీటర్లు వచ్చామో లేదో కార్లో మా తాతయ్య ఎదురు పడ్డాడు. పెళ్ళికి వెళ్తున్నానని ఎంతచెప్పినా వినకుండా "నీకోసమే యింత దూరం వచ్చాను చాలా అవసరమైన పని" అంటూ కార్లో ఎక్కించుకుని తిరిగి హైదరాబాదు





కులాసానిచ్చే
మీ సొంతపు పడకగదీ

సంతోషాన్ని పరిచే
మా పెయింటూ




## ...మరో మూడు చేతులు
## అదే పూతలేస్తే మరింత మెరుగుగదా!

మీరు కులాసాగా ఉండగలిగేది మీ సొంతపు పడకగదిలో! ఆ గదికి జీవం పుట్టించే
రంగు వెయ్యండి, మరింత మీ హృదయం సంతోషంతో నిండిపోతుంది.
నెరోలాక్ సోల్జర్ బ్రాండ్ వాషబుల్ ఆయిల్ బౌండ్ డిస్టెంపర్ యొక్క ఆకర్షణీయమైన
పెయింట్ ఫినిష్ సంగతి వేరే చెప్పాలా! కళ్ళను మురిపించే ఎన్నో రంగుల్లో దొరికే
యీ పెయింట్లు మీ గోడలకు ఎంతో అనువుగా నప్పుతాయి...ఏ రకంగా చూసినాసరే
నిలిచే అందం...దాంతోబాటు ఎంతో పొదుపు కూడాను.
ఏళ్ళ తరబడి అదే రకంగా నిలిచి ఉంటుంది యీ పెయింటు.



యోగించే
రంగు
యోగం

# నెరోలాక్ సోల్జర్ ఆయిల్ బౌండ్ డిస్టెంపర్

U-GND 181 Tel

తీసుకొచ్చాడు. దురదృష్టవంతులైన మిగతా ఐదుగురిలో జీప్ పెళ్ళికని వెళ్ళిపోయింది. వాళ్ళే కాస్త ముందుకు వెళ్ళాక..."

నిట్టూర్చాడు నరేన్.

## శాంతి తీరం

మాధవి భయంగా అతన్ని కరుచుకు పోతూ "ప్లీజ్, ఇక ఆ సంగతి చెప్పకండి" అంది. ఆమె కళ్ళముందుకు ఆనాడు రైల్వే ప్లాట్‌ఫారంమీద పేపరు చూడటం, ఆ వార్త విని స్థాణువై పోవటం, గుండె నీరై పోవటం అంతా ఒక్కసారిగా వచ్చింది.

"అంత హడావిడిచేసి హైదరాబాదు తీసుకువచ్చింది తీరా పెళ్ళి చూపులకట!

నేను చూడనన్నాను. నాకు పెళ్ళే అక్కర్లేదన్నాను ఇక్కడెందుకనుకున్నాడేమో మా వూరు తీసికెళ్ళాడు అక్కడికి వెళ్ళాక "ఏమిటి నీ కథ?" అంటూ నిలవేశాడు. ఉన్న విషయం అంతా దాచకుండా చెప్పాను, ఏమనుకున్నాడో ఏమో "ఆ అమ్మాయి గర్భవతి కావటం నిజమేనా?" అని అడిగాడు. ఔనని ఒట్టు వేశాను, "ఆల్ రైట్ నేను ఎంక్వయిరీ చేసుకుంటాను. ఆ అమ్మాయిని రిజిష్టర్ మారేజ్ చేసుకున్నదీ, ఆ అమ్మాయి గర్భిణి అన్నదీ నిజమైతేనే ఆ అమ్మాయి నీ భార్య అవుతుంది. రెండూ అబద్ధమైతే నీవు నేను చెప్పినట్లు మాత్రమే వినాలి. అంత వరకూ వూరు విడిచి పోకు" అన్నాడు.

నాలుగు రోజుల తర్వాత తాతయ్య నిజంగానే ఎంతో బాధపడుతూ "నీకు అదృష్టం లేదురా నరేన్ నీవు జీప్ ప్రమాదంలో మరణించావనుకుని ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందట" అని చెప్పారు. బహుశా ఆ మరణవార్త వినగానే అది భరించలేక ఆత్మహత్య చేసుకున్న అమ్మాయి ఎంతో ప్రేమమూర్తీ, యోగ్యురాలూ అయి వుంటుందనికాబోలు తాతయ్య అభిప్రాయం.

తాతయ్య చెప్పింది నేను నమ్మలేదు. అలా చెప్పి, నన్ను మోసంచేసి, మరో పెళ్లి చేసేందుకు ప్లాన్ అనుకున్నాను అలాంటివి ఎన్నో జరుగుతూంటాయి కూడాను. తాతయ్యే నేమైపోతానోనని భయపడి వారిస్తున్నా వెంటనే బయలుదేరి హైదరాబాదు వచ్చేశాను.

జయశ్రీ ద్వారా మీ యింట్లో అంతా తెలిసింది. నీవు కనిపించకపోయేసరికి మీ వాళ్ళు ఆనంద్ ఇంటికెళ్ళి అడిగారు. జయశ్రీ అప్పటికి అక్కడే వుంది కదా? ఆమెకు నీవు చెప్పావట నేను జీప్‌లో పెళ్లికి వెళ్లినట్లు. పేపర్లో చూసి అనుమానించినా మీ వాళ్లు వెళ్లి అడిగేసరికి జీప్ ప్రమాదంలో చనిపోయింది నేనేననీ, అది చదివి నీవు ఏమో అయిపోయి వుంటావనీ చెప్పిందట ఏడుస్తూ. అంతా కలిసి వెదికారు కానీ ఎక్కడా కనిపించలేదు నీవు. నేను వెళ్లాక "నీవు బ్రతికేవున్నావా నాయనా? దాని వుసురు పోసుకుని బ్రతికే వున్నావా? నీ కోసం అది ప్రాణాలే ఒదిలేసింది కదా ఇంకా ఏంమిగిలిందని వచ్చావు?" అంటూ ఏడ్చారు; శాపనార్థాలు పెట్టారు మీవాళ్ళు. చివరకు ఆనంద్, జయశ్రీకూడా నన్ను ఈసడింపుగా చూశారు. చివరకు అందరూ నీవు ఎక్కడో ఆత్మహత్య చేసుకున్నావని నిర్ధారణ చేశారు.

నా వెనకే వచ్చిన తాతయ్య నన్ను ఓదారుస్తూ వూరికి తీసుకు వెళ్లాడు. నాకు లోకమే చీకటైంది; పగలూ, రేయీ ఒక్కటైంది. జీవితమే శూన్యమైపోయి, మతిభ్రమించిన వాడిలా కొన్నాళ్ళు కాలు బయట పెట్టకుండా మానసిక నరకం అనుభవించాను. ఆ తర్వాత నీ కోసం దేశమంతా వెతికాను మనసు విరక్తి చెంది ఏదైనా సేవాసదనంలోనో, మహిళాసమాజంలోనో, చేరిపోయావేమోనని అలాంటివన్నీ గాలించాను చివరకు ... మధూ ... నేను కూడా నీవు ఈ లోకంలో లేవనే నిర్ణయానికి వచ్చాను. నీవు లేవనే నిజాన్ని భరించలేక, ఈ దేశంలోనే వుండలేక మార్పు నాశిస్తూ ఫారన్ వెళ్ళాను మార్పు మేధస్సులో వచ్చిందిగానీ మనసులో రాలేదు. నా మారని మనస్సులో నీవు జీవించే వున్నావు మధూ వుంటావు" తన గుండెల మీద మాధవి శిరసును ఆర్తిగా చుంబించాడు నరేన్.

తన తల మీద పుష్పాక్షతలు చల్లినట్లయింది మాధవికి. అలా అతని గుండెల మీద పడుకునే కుడిచేతినెత్తి వేళ్ళతో అతని పెదిమలను తడిమింది. ఆ వెచ్చని తడి స్పర్శతోపాటు సన్నని మీసాల గరుకుతనం ఆమె శరీరాన్ని గగుర్పొడిచేలా చేసింది. చటుక్కున చేతినిలాక్కోబోగా ఆ ప్రయత్నం కొనసాగనివ్వకుండా నవ్వుతూ పెదిమలతో ఆ వేళ్లను బిగించాడు నరేన్.

సిగ్గుగా "ప్లీజ్" అంది ఎంతో గట్టి బంధాన్ని వదిలించుకోలేని నిస్సహాయురాలిలా.

తన పెదిమల మధ్య చిక్కుపడిపోయిన మాధవి చేతిని తన చేతితో అందుకుని బుగ్గకు రాసుకుంటూ "ఊహూ, వదలను నీవు మంచిదానివి కాదు. వదిలితే మిణుగురు పురుగులా మాయమౌతావు. అందుకే నిన్ను ఒట్టి చేతులతో కాదు, పెదిమలతో, కళ్లతో, హృదయమంతో కూడా బంధించాలి" అన్నాడు చిలిపిగా.

మైమరచిపోయింది మాధవి.

ఇది కలేమో, కరిగిపోతుందేమో నన్నంత భయంగా, గట్టిగా కళ్ళు మూసుకుంది. మరింత గట్టిగా కౌగలించుకుంటూ 'ఇది ప్రేమ బంధం, ఇది పూల బంధం. సడలదు, తెగదు, విడిపోదు' అనుకుంది, మనసులో.

"నీవు ఇలా సుదూరంగా వచ్చేసి వుంటావనిగానీ, వచ్చేసినా బ్రతికి వుంటావనిగానీ ఎవరూ అనుకోలేదు. కష్టంలో ఎవరైనా కన్నవారి ఒడి, ఓదార్పు కోరుకుంటారు. దానికి విరుద్ధంగా నీవిలా ఎందుకు వచ్చేశావో నా కర్థం కావటంలేదు. నీవేం తప్పు చేశావని ?"

నరేంద్ర అడిగినదానికి మాధవి మనసులో దాగిపోయిన గతమంతా మాటల్లోకి వచ్చింది.

"...చివరకు ఆ రోజు హాల్లో కూర్చున్న నాకు మీ కంఠస్వరం వినిపించింది. మీరేనని నేను కల్లోకూడా అనుకోలేదు. నా ఆశ్చర్యమంతా 'స్వరంలో ఎంత పోలిక !' అని మాత్రమే. అలాగే కూర్చుని మైమరచి వింటూండిపోయిన నన్ను వసు బయటికి లాక్కెళ్లింది.

ఎందుకో నా నరేన్‌లాంటి స్వరాన్ని కలిగిన ఆ వ్యక్తిని చూడాలని నా మనసు ఎంతగానో తహతహలాడింది. రోజురోజుకూ ఆ కోరిక బలీయమై నిలువనీయకుండా చేసింది. వారం రోజుల సంఘర్షణానంతరం ఎలాగైనా ఆ వ్యక్తిని ఒక్కసారి చూసి తీరాలనే ఆశతో మీరు చీనీతోటలో వుంటారని తెలిసి అక్కడికి వచ్చాను. నర్సింగ్ హోం కట్టే చోటికి వస్తే మిమ్మల్ని చూడొచ్చు. కానీ అంతమందిలో ఆ వ్యక్తి ఎవరో నేనెలా గుర్తించగలను ? ఎవరిని ఏమని అడగను ? ఒకసారి దూరంనించి




మీరు వెనుకటిలా ప్రభుత్వాన్ని విమర్శించకూడదుసార్ ! ప్రస్తుతం మీరు మంత్రిపదవిలో వున్నారు !!

## శాంతితీరం

మాత్రం చూసి రావాలని నిశ్చయించుకొని చీనితోటకు వచ్చాను.

తోటమాలి తాతతో మాట్లాడ్తూ కేవలం తోట చూడటానికే వచ్చినట్లు నటిస్తూ అలా తిరుగసాగేను. మీరున్న గది దగ్గరకు వచ్చేసరికి తాతే అందులో మీరున్నారన్న సంగతి చెప్పాడు. నాకు తెలియదనుకుని.

"అలాగా!" అన్నాను మామూలుగా.

అలాగే కొద్దిదూరం వెళ్ళాక తాత తన పనిమీద వెళ్ళిపోయాడు నేను మళ్ళీ వెనక్కు తిరిగి గది దగ్గరకు వచ్చాను. తాళం వేసిలేదు. మీరున్నారనుకుని కొంచెం దూరం నించి కిటికీలోంచి చూశాను. గదిలో ఎక్కడా మీరు లేరు. కుతూహలాన్ని ఆపుకోలేక మెల్లగా తలుపు దగ్గరకు వచ్చి తట్టాను. జవాబులేదు. ఇక లోపలికే వచ్చాను, పెద్ద సామాన్లేంలేవు మంచం మీద బెడ్ వుంది. కిటికీ పక్కన స్టూల్ మీద సూట్‌కేస్ వుంది బెడ్ మీద ఏదో పుస్తకం మధ్యకు తెరచి బోర్లించి పెట్టారు. ఇక్కడికి వచ్చి కూడా ఆ మనిషిని చూడలేకపోయానే అన్న ఆలోచనతో పరధ్యానంగా ఆ పుస్తకాన్ని అందుకుని, అల వోకగా పేజీలు తిప్పాను. ఏదో ఫోటో జారిపడింది. అదిచూసి ... అదిచూసి...నరేన్ ఏం చెప్పను? స్వరాలు ఒకటిగా వుండటం, మీ ఫోటో కనిపించటం నాకు అనుమానం వేసింది మీరేనా అని. మరుక్షణం ఫోటో తీసుకుని నర్సింగ్ హోం దగ్గరకు పరుగులతో వచ్చాను. నా సంతోషం మాటల్లో పొదగ గలిగిందా?! కానీ నిప్పుమీద నీళ్ళు చల్లినట్లుగా 'నా భార్య...రాదు' అన్న మీ మాట గుర్తుకొచ్చి కుప్పలా కూలిపోయాను. ఎలాగో ఇంట్లో పడ్డాను నా కర్తవ్యమేమిటో నాకు బోధపడలేదు. కర్తవ్యమేముంది ఇక? సాధ్యమైతే మీరు వెళ్ళేవరకు మీ కళ్ళబడకుండా వుండి ఆ తర్వాత మామూలుగా జీవించటం లేదా ఆత్మహత్య చేసుకోవటం. కానీ నా కాళ్ళ బంధం, మీ ప్రతిరూపం బాబు..."

"బాబు!!!" ఒక్క వుదుటున లేచాడు నరేన్.

"మధూ, ఏడీ? నా బాబేడీ? మన బాబేడీ? నిన్ను చూసిన ఆనందంలో వాడి సంగతే మరచిపోయాను. ఏడీ? ఏడీ?" కుదిపేశాడు నరేన్ మాధవిని.

ఏదో చప్పుడయింది. ఒకరి కౌగిలిలో ఒకరువున్న నరేన్, మాధవి వులికిపడి చూశారు.

బాబును ఎత్తుకుని నిలబడిన శ్రీనాధ్! అతని కళ్ళలో అంతులేని ఆశ్చర్యం, ప్రపంచంలో లేని వింతైనదేదో చూస్తున్నంతగా శిలలా నిలబడి వున్నాడు.

నరేన్ ఒక్క వుదుటున వెళ్ళి శ్రీనాధ్ చేతుల్లోని బాబు నందుకుని ముద్దుల్లో ముంచెత్తాడు. ఆ దృశ్యాన్ని ముగ్ధురాలై చూస్తూండిపోయింది మాధవి.

శ్రీనాధ్ కేదో అర్థమైనట్లయింది. అతని కళ్ళలోంచి ఆశ్చర్యం తొలగిపోయి ఆనందం చోటు చేసుకుంది.

"మాధవీ, బాబును అక్కడే వదిలేశావు. వను పడుకుని వుంది. ఇక నీకోసం ఒక్కలా ఏడుస్తూంటే తీసుకు వచ్చాను. అదీగాక మీరిద్దరూ అలా రావటం చూసి సంగతి కనుక్కుందామని..." అంటూ ఆపేశాడు శ్రీనాధ్. అతని కళ్ళలో ఆనందభాష్పాలూరుతున్నాయి.

"అన్నయ్యా" అంటూ దగ్గరగా వచ్చింది మాధవి.

నరేన్ బాబును క్రిందికి దించాడు. మాధవి, నరేన్ ఒక్కక్షణం ఒకరినొకరు చూసుకుని మరుక్షణం ఇద్దరూ శ్రీనాధ్ పాదాలమీద వాలిపోయారు.

కళ్ళలోంచి ఆనందబాష్పాలు జలజల రాలిపోతూండగా ఇద్దర్నీ లేపి ప్రక్కన చేర్చుకున్నాడు శ్రీనాధ్.

దూరంగా నిలబడ్డ బాబు నోట్లో వేలుంచుకుని ఆశ్చర్యంగా చూశాడు.

వాణ్ణిచూసి నవ్వుతూ, కర్చీఫ్ తీసుకుని కళ్ళు అద్దుకుంటూ "వెళ్ళొండి. మీ కోసం వసంత చూస్తూ వుంటుంది" అన్నాడు శ్రీనాధ్.

'ఔను, చూస్తూ వుంటుంది. తన కోసం ఎన్నో ఇబ్బందులు నెదుర్కొన్నా, ఎందర్నో దూరం చేసుకున్నా, చివరకు తన కోసమే కడుపులోని ఆనందఫలాన్ని వ్యర్థం చేసుకున్న వసు తనకోసం చూస్తూనే వుంటుంది.' (అయిపోయింది)

# భారత దేశంలో అన్నిటికన్నా అధికంగా అమ్ము బడుతోంది

ఏ యితర డిటర్జెంట్ ఉతికే బిళ్ల లేక బార్ తో పోల్చి చూచినా




# సూపర్ 777

లక్షలాదికి మక్కువైనది, వారు నమ్మికతో చెప్పేది:
సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్

ఎక్కువ కాలం వస్తుంది; హెచ్చు తెల్లదనంనిస్తుంది;
సబ్బుతో పోల్చి చూస్తే ఇది మీ డబ్బును పొదుపు చేస్తుంది.

హెచ్చు తెల్లదనం, తక్కువ ఖర్చులో

Shilpi-dm-6a/77 Tel




## వంటలు | పూరి • కుర్మా

చాలా ఇండ్లలో రాత్రిళ్లు అన్నానికి బదులు ఫలహారం తినడం అలవాటు. పూరి లేక రొట్టెలు, వాటితో కూర్మా చాలా మందికి ఇష్టం.

విధానం : - కూర్మా సాధారణముగా ఆలుగడ్డ (బంగాళదుంప), అరటికాయ, కాబేజి, టమాట, కాళీఫ్లవర్, సొరకాయ వాటితో విడిగాకాని లేక మిశ్రమముగాగాని చేస్తారు కుర్మా మామూలుగా ఎర్రకారం లేక పచ్చి మిరపకాయులు, పసుపు, ఉప్పువేసి చేయండి - వేపుడు లేక ముద్దగా లేక గ్రేవీతో ( నీళ్లకూర ). ఇష్టమైనవారు కొద్దిగా అల్లం, వెల్లుల్లికూడా రుబ్బివేయవచ్చును కూర ఉడికిన తర్వాత మంచిరకం లవంగాలు, ఏలకులు, దాసించెక్క, షాజీరా, జాజికాయ సరిపాళ్లలో పొడిచేసి కూరలో వేసి కలపండి. 2-3 నిమిషముల తర్వాత నిప్పుమీదనుంచి దించండి. కొద్ది సేపులో ఈ మసాలా ఘాటు ముక్కలకు బాగాఎక్కి కుర్మా ఎంతో రుచిగా ఉంటుంది.





### కర్నాటి లక్ష్మీనర్సయ్య
### జీవితం ఒక నాటక రంగం

(శ్రీ పిడికిటి రామకోటేశ్వరరావు ప్రధానసంపాదకత్వంలో వెలువడిన అభినందన సంచిక మాకార్యాలయం చేరింది. 114 పేజీలు, వెల తెలియదు. ప్రతులకు: నవజీవన బుక్‌లింక్స్, ఏలూరురోడ్డు విజయవాడ—2.

ఆంధ్రనాటకరంగంపై మూడుదశాబ్దాలుగా వైవిధ్యం గల వివిధ పాత్రలలో జీవిస్తూ మహానటుడనిపించుకున్న శ్రీ కర్నాటిలక్ష్మీనరసయ్య గారి జీవితవిశేషాలు, ప్రతిభా వ్యుత్పత్తులను ప్రస్తుటం చేస్తూ, పలువుర ప్రముఖులు వ్రాసినవెన్నో ఈ పుస్తకంలో ఉన్నాయి.

# ఉచితం
## బినాకా టూత్‌బ్రష్

బినాకా టాప్
టూత్‌పేస్ట్
ఫామిలీ లేదా సూపర్ సైజ్‌తో




బినాకా టాప్ టూత్‌పేస్ట్ కొనండి, మరి
భారతదేశపు అత్యధికంగా అమ్మకంగల
టూత్‌బ్రష్ పొందండి, బినాకా ఎడల్ట్ స్టాండర్డ్
**ఉచితం.**

ఈ దిగువ పట్టణాలలోనే చిల్లరగా లభిస్తుంది సరుకు ఉన్నంతవరకే!
హైదరాబాద్, సికింద్రాబాద్, నిజామాబాద్, వరంగల్/
హనుమకొండ, విజయవాడ, గుంటూరు, నెల్లూరు,
గుడివాడ, తెనాలి, మచిలీపట్నం, ఏలూరు, రాజమండ్రి,
కాకినాడ, విశాఖపట్టణం, విజయనగరం,
తాడేపల్లిగూడెం, భీమవరం, అమలాపురం, కర్నూలు, అనంతపూర్. తిరుపతి. శ్రీకాకుళం.

**బినాకా టాప్ మీకు తాజాదనపు అనుభవాన్ని
నమ్మకమైన సంపూర్ణపు నోటి రక్షణనిస్తుంది.**

## ఉత్తరాలు

సామాన్యుడు గారు, అంటే ముఖ్యంగా హిందీ యేతర భాషలవార్లే నిర్ణయించాలి ఇంగ్లీషు ఎప్పటికైనా పోయి హింది అధికారభాషగా దేశంలోరావటం మంచిదే. కాని మరిరోజురోజుకీ పెరుగుతున్న, ఇంగ్లీషు మీడియమ్ స్కూల్సు, కాలేజీలు, నాటికి పెరుగుతున్న డిమాండు, దీటికి కారణం ఏమిటి? ఎవరు?

కె.రాధాకృష్ణ మూర్తి [హైదరాబాద్.]

## తాజా కాలం

(7 వ పేజీ తరువాయి)

ఆడటంలేదయ్యా? నాకేమి 'ఎత్తు'లు లేవు'' అన్నది

ఆంధ్రలో కర్ణాటకలో రాజకీయాలు చిత్రాతివిచిత్ర విచిత్రంగా మారిపోతున్నాయి. అక్టోబర్ మూడోవారంలో యిది పాఠకులకు చేరేసరికి యీ రాష్ట్రాలలో రాగల పరిణామాల మీద యిది రాస్తున్న దశలో వూహించటం కష్టం — కాని రాష్ట్రపతి అప్పటికి ఆంధ్రాలో మకాంవేసి వుంటారు!

కాంగ్రెసు 'కళ్యాం' శ్రీ రెడ్డి నుంచి శ్రీమతి ప్రియదర్శిని తీసుకుంటే శ్రీ రెడ్డి ఆంధ్రాపొలిటిక్స్‌లోకి దిగవలసి వుంటుందా? అన్నది కూడా 'దూరాలోచ'నేగాని దురాలోచన కాజాలదు. ఏది ఏమైనా కాంగ్రెసు జనతా పార్టీలు రెండూ కూడా దీపావళికి ''టపాకాయల పండుగ''ను ప్రజల ఎదుట బ్రహ్మాండంగా చేసి చూపాలనుకోవడం సహజం ... శ్రీమతి ఇందిరా ప్రియదర్శిని అరెస్టుమీద కృపలానీ వ్యాఖ్యానం, డాంగే వ్యాఖ్యానం, జె. పి. మవునం లాంటివన్నీ జనతా కాంగ్రెసు పార్టీలమధ్య రాజకీయ చదరంగ ఆట జరుగుతున్నదనీ, ఆ ఆటలో పైన పేర్కొన్న నాయకులు ''పావుల''ని అనిపించకమానదు!!

దసరాకి ''ఆయుధపూజ'' చేస్తున్న యీ రెండుపార్టీలు దీపావళి బాణసంచాగా ఏమి చేస్తాయో ఎదురు చూడటం తప్ప— మామూలు మనుషులు— ''ధర''లు తగ్గుతాయని ఊహించడం కష్టం— ఎందుకంటే ధరలు తగ్గించటానికి 4 మాసాలు కనీస సమయం కావాలన్నది కదా జనతా గవర్నమెంటు—

(వీ రా టీ)


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# ఆకురాలు కాలపు మీ విశ్రాంతి కేవలం కొద్ది గంటల దూరంలోనే ఉంది.



భారత దేశంలోని ప్రతీ ప్రాంతం వెయ్యి వసంతాల శోభలతో మీకు ఆనందం కలిగిస్తుంది కొద్ది గంటల లోనే మీరు మీ గమ్యాన్ని చేరుకో గలరు —విమానంలో,

## ఉత్తరం

**కులు** దేవతల లోయ అందమయిన దసరా వేడుకలతో మిమ్మల్ని అలరిస్తుంది ఏపిల్ పళ్ళ తోటలతో ప్రకృతి సౌందర్యానికి నిలయం **అతి** దగ్గరలోని విమానాశ్రయం— చండీఘడ్

**కాశ్మీర్** · చక్కటి చీనార్ చెట్లు, బంగారు కాంతుల సూర్యాస్తమయాలు అతి దగ్గరలోని విమానాశ్రయం—శ్రీనగర్

**నైనిటాల్** నిర్మలమయిన సరోవర జలాల సమీపంలో, మనస్సుని **ఉల్లాసపరిచే** ప్రశాంత విశ్రాంతి కేంద్రం **అతి** దగ్గరలోని విమానాశ్రయం—**ఢిల్లీ**

## దక్షిణం

**మైసూరు** : బండీపూర్ వన్యమృగ కేంద్రం కేవలం రెండు గంటల దూరంలోనే ఉంది నగర రాజప్రాసాదాన్ని తిలకించండి హిందూ, సరసెనిక్ శిల్పకళా సమ్మిళిత సౌందర్యం బృందావన్ గార్డెన్స్, పార్కులు, ఉద్యానవన మార్గాలు

**పెరియార్** సరస్సు, వన్య మృగ కేంద్రం భారత దేశపు **ఉత్తమ** వన్య మృగాలలో కొన్నింటిని మీరు ఇక్కడ చూడగలుగుతారు అతి దగ్గరలోని విమానాశ్రయం— తిరువనంతపురం.

**హైదరాబాదు** ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సాలార్‌జంగ్ మ్యూజియం నెలకొన్న నగరం ఇక్కడి బిద్రి వస్తువులు, నిర్మల్ పెయింటింగ్‌లు కనులకు పండువ. చార్మినార్ పైనుంచి నలువైపులా వ్యాపించిన నగరాన్ని పరిశీలించండి

## తూర్పు

**కలకత్తా** దుర్గా పూజా కాలంలో పండుగ వేడుకలతో పరవశించే మహా నగరం విక్టోరియా కాలపు ప్రాచీన కట్టడాలు అనువుగా అంతర్జాతీయ విమానాశ్రయం

**డార్జిలింగ్** ప్రశాంతమయిన పర్వత విశ్రాంతి కేంద్రం అక్కడ నిలబడితే హిమవత్పర్వతాలు నేత్రపర్వంగా దర్శనమిస్తాయి. విమానాశ్రయం బాగ్‌డోగ్రా— సిక్కిం వెళ్ళేందుకు ముఖద్వారం

**పూరి** . జగన్నాథస్వామి నిలయం తూర్పు భారత దేశంలోని అతి చక్కటి బీచ్‌లలో ఒకటి అతి దగ్గరలోని విమానాశ్రయం— భువనేశ్వర్ కోణార్క్‌కు వెళ్ళేందుకు ముఖద్వారం

## పడమర

**గిర్** గుజరాత్‌లోని వన్య మృగ కేంద్రం అక్కడ భారత దేశపు మృగరాజు రాచఠీవితో దర్శనమిస్తాడు అతి దగ్గరలోని విమానాశ్రయం భావనగర్ పాలితాణ, మొధేరా దేవాలయాలకు వెళ్ళేందుకు మార్గం

**గోవా** సూర్యకిరణాలతో తడిసి, తాటితోపుల తోరణాలతో తళతళ మెరిసే బీచ్-భూతల స్వర్గం కోటలు కేథెడ్రెల్స్, ప్రాచీన దేవాలయాలు అతి దగ్గరలోని విమానాశ్రయం— డబోలిమ్

**అజంతా-ఎల్లోరా** భారత దేశపు అద్భుత గుహలు ఔరంగాబాద్ —అతి దగ్గరలోని విమానాశ్రయం

**ఎక్కడ నుంచి అయినా సరే కొద్దిసేపు విమానప్రయాణం**

ఇండియన్ ఎయిర్‌లైన్స్ అతి వేగంగా వెళ్ళే అధునాతన విమానాలతో, దేశమంతటా ఉన్న సర్వీసులతో మిమ్మల్ని ఎక్కడకి అయినా సరే చేరవేస్తుంది

**మీ ట్రావెల్ ఏజెంట్, అన్ని ఏర్పాట్లతో మీకు సహాయ పడతారు**




India
Sri Lanka

పలు ప్రదేశాలకు



ద్వారా

ప్రయాణం చేయండి

**ఇండియన్ ఎయిర్‌లైన్స్**


యమగోల
ఈస్ట్మన్ కలర్
దర్శకత్వం తాతినేని రామారావు
నిర్మాత: యస్. వెంకటరత్నం
ఆంధ్ర నైజాం: లక్ష్మీ ఫిలింస్ సీడెడ్. నవభారత్ ఫిలింస్
LAKSHMI PUBS